ఖించిన దుర్దశలో - ఈ ముప్వురు పెద్దలు మూఁడు రాష్ట్రములలో ముత్యములువోలె నావిర్భవించి, సర్వస్వము తమ దేశమునకు ధారవోసి యావద్భారతములో మకుటము లేని మహారాజులై దివ్యమూర్తులై వర్ధిల్లిరి. విద్యారంగములో వీరు నెలకొల్పిన దివ్యసంస్థలు వీరి విద్యాపాటవమును వేనోళ్లఁ జాటుచున్నవి. రాజకీయముగా వీరు గావించిన ఘనకార్యములు స్వారాజ్యమువంటి స్వరాజ్యమునకు మూలకందమై సర్వాదర్శములైనవి. రామాయణ మహాభారతములలోని వీరావతారములను బోలిన - ఈ దివ్యమూర్తుల చరిత్రను [illegible]థలుగా గాథలుగాఁ గావ్యములుగాఁ జిత్రించుకొని పారాయణము సేయుట మనకు భావ్యము.

ఈ భావము ప్రధానముగాఁ గయికొని నా[illegible]పురేఖలు దిద్దిన యీ రచనలోని యౌచిత్యమును విద్యాశాఖ మన్నించుననియు విద్వద్వరిష్ఠు లామతింతురనియు విశ్వసింతును.

— సత్యనారాయణ చౌదరి

# అర్పణము

'గోవా' క్రౌర్యనివృత్తికై యసువులన్ గోల్పోయి త్యాగైకస
ద్భావావేశము నూఱిపోసిరి మహాభాగుల్ – నిరీహుల్; స్వరా
జ్యావిర్భావముతప్ప;దిప్పటికెయీ 'యధ్యాయ'మాద్యంతమున్
యావద్దేశము నూఁపివైచె బళిరా! యత్యంత ముద్వృత్తిమై

సాత్త్వికమూర్తి యొంటిపయి జాఱిన నెత్తురుచుక్క యొక్కఁడే
'సత్త్వరచర్య' తీసికొనఁజాలుఁగదయ్య! 'మహాత్ముఁ'డెన్నఁడో
తత్త్వము దేల్చి లోక మొకదారిని బోవను నేర్పెఁ దన్మహా
సత్త్వ మెఱుంగలేక యగచాట్లకుఁ బాలయిపోవ నేటికిన్ ?

ఆ రహస్య మెఱింగి వీరావతార
మూర్తులై ప్రాణములు ధారపోసినట్టి
దివ్యమూర్తుల కిత్తు నీ 'దివ్యమూర్తి'
నామకంబైన కృతిని ధన్యంబటంచు.

ఆంధ్రరాష్ట్ర ద్వితీయవార్షికోత్సవ
పర్వదినము : ౧-౧౦-౧౯౫౫

— సత్యనారాయణ చౌదరి

ఓం

# శ్రీ మదనమోహన మాళవ్యా

సుప్రసిద్ధమగు రాజస్థానములో 'మాళవా' ప్రాంతమని యొక ప్రదేశము కలదు. తడవులఁబట్టి యక్కడఁ గాఁపుర మేర్పఱచుకొన్న యొకానొక బ్రాహ్మణవంశము వారిని మాళవ్యులని పిలువ సాగిరి. అదియే తుదకు వారి కింటిపేరుగా మాఱిపోయెను. ఆ వంశములో జన్మించిన మహామహుఁడే మదన మోహన మాళవ్యా.



ఆసేతుహిమాచలము మాళవ్యా వంశమునకు మంచి పేరు ప్రఖ్యాతులు కలవు. వారిలో విశేషించి వ్రజనాథ మాళవ్యా సనాతనధర్మావలంబియగు మహాపండితుఁడు. ఆ యింట లక్ష్మీసరస్వతులు నిత్యకల్యాణముగఁ దాండవింతురు. సిరిసంపదలకుఁ దోడు విద్యావివేకములు సైతము కుదిరి యుండుట గొప్ప సుకృతవిశేషము. అందును - ధార్మికబుద్ధి యున్నచో మఱింత రాణింతురు. అట్టి మంచిగుణములు పుణికి

పుచ్చుకొన్న సంపన్నుఁడైన ప్రజనాథుఁడు సర్వప్రజలకుఁ
బూజ్యుఁడగుటలో నబ్బుర మే మున్నది? ఆయన విద్యా
ధికుఁడనని విఱ్ఱవీఁగఁడు. విత్తవంతుఁడనని యెగిరిపడఁడు.
అందఱ కాయన తలలో నాలుకవోలె మెలఁగనేర్చెను.
ఆవంతయేని గర్వగంధ మంటియుండని సంస్కృతపాండిత్య
మాయన కగ్గలముగా సిద్ధించెను. పురాణ వాఙ్మయము
బాఢముగాఁ జూఱలాడెను. ధర్మశాస్త్రములో లోఁతులు
తడవిచూచెను. ఉపనిషద్భాగము చక్కఁగా నెమరునకుఁ
దెచ్చుకొనెను. భాష్యత్రయము బాలశిక్షగాఁ జేసికొనెను.
ఈ రీతిని సర్వతోముఖముగ సంపూర్ణజ్ఞానము సంపాదించు
కొన్న యా కర్మిష్ఠి మహాజ్ఞాని యని పేరు వడసెను. పైగా
సంస్కృతభాషలో - ఆయన మంచిగ్రంథములు వ్రాసి మహా
గ్రంథకర్త యనిపించుకొనెను.

అట్టి గుణవంతుని కడుపున - ప్రయాగక్షేత్రములో
1861 డిసెంబరు-పదునైదవతేదిని మదనమోహన మాళవ్యా
జన్మించెను. తన సంతానముసైతము తనవలెనే పండితులై
లోకములో మన్నన వొందవలెనని తండ్రిగారి సంకల్పము.
అక్షరాల - ఈ కోరిక యీ బిడ్డ జన్మించుటచే - ఆ తండ్రికిఁ
దీరినది.

మదనమోహనుని చదువుసంధ్యలు కొంతవట్టు శైశవ
ములో నింటిపట్టుననే సాగెను. అవలఁ గొన్నాళ్ల కాతనిని
'ధర్మజ్ఞానోపదేశ' మనుపేర వెలసిన యొకానొక పాఠశాలలోఁ
బ్రవేశపెట్టిరి. అక్కడి చదు వంటినవెనుక 'విద్యాధర్మ
వర్ధనీ' పాఠశాలలో నాతఁడు ప్రవేశించెను. సహాధ్యాయు

లలో మేలుబంతియై చదువుసంధ్యలలో నేమఱుపాటు లవ లేశము లేక విలువ యిడరాని యొక మేలిరవ్వగా మాళవ్యా భాసింపసాగెను.

ఆవల - ఆ ప్రాంతమందలి యాంగ్ల పాఠశాలలోఁ జేరి యాంగ్ల విద్యలో నడుగు వెట్టెను. ఆ రోజులలో - ప్రయాగలో విశ్వవిద్యాలయము లేదు. మదనమోహనుఁడు కలకత్తా విశ్వవిద్యాలయమువారి 'ఎన్ట్రెన్స్' పరీక్షకై సొమ్ము కట్టి 1879 - యేఁట - ఆ పరీక్షలో నుత్తీర్ణుఁడాయెను. పదపడి కొన్నాళ్లకు 'మ్యోరా సెంట్రల్ కాలేజి'లోఁ జేరి యున్నతవిద్యను గడించెను. 1884 వ - సంవత్సరములో బి. యే పరీక్షలో నెగ్గెను. యమ్. ఏ పరీక్షకు సంసిద్ధుఁడయ్యు ననివార్యములగు కారణములచే దాని కాతఁడు 'స్వస్తి' చెప్పవలసివచ్చెను. సుప్రసిద్ధులయిన పండిత మోతీలాల్ నెహ్రూ - పండిత సుందరలాల్ - డాక్టరు సతీష్‌చంద్ర బెనర్జీ మదనమోహనుని సహాధ్యాయులై మంచిపేరు గడించిరి.

విద్యార్థిగా - పరీక్షాఘట్టముగా మదనమోహనుఁడు ప్రథమశ్రేణిలోఁ జేరలేదు. అప్పటి యాతని జీవితము మధ్యమశ్రేణిలోనే గడచుటకు బలవత్తరమైన కారణ మున్నది. ఆ కిటుకు గుఱుతించినఁగాని మదనమోహనుని దివ్యజీవితము మనస్సున కెక్కదు. లోకములో విద్యార్థు లలోఁ గొందఱు పాఠ్యగ్రంథములలోనే పంచప్రాణము లుంచి క్రిమికీటకములువోలె సంచరింతురు; వారికి లోకజ్ఞానము కడుదూరము. మఱికొందఱు 'లోకాభిరామాయణము'లోనే పాలు పంచుకొని విద్యావ్యాసంగములో నేమఱుపాటుతో

మెలఁగి విఫలమనోరథులయ్యేదరు. ఇఁకఁ గొందఱు తాము చదివెడు చదువులకు ననుపానముగ వినయవివేకములు పుణికి పుచ్చుకొని దేశారాధనకోసమై త్రోవలు చూడనేర్తురు. వీరిలోఁ జేరిన విద్యార్థియే మదనమోహన మాళవ్యా. పరీక్షారీతిగా నాతఁడు కనిష్ఠికాధిష్ఠితుఁడు కాలేకపోవచ్చును. కేవలము చదువులలో మునిఁగి పెనఁగి వట్టి కూపస్థమండూకముమాత్రము కాలేదు. జన్మాంతర సుకృతవిశేషమో యన్నట్లు పుట్టువుఁదొట్టి మదనమోహనుని లేఁత హృదయములో దేశభక్తి గాఢముగా నాటుకొనెను. దానికిఁ దోడు ధర్మకార్యతత్పరత చక్కఁగాఁ బెనవైచుకొనెను. ఆ దశలో నాతఁడు విలువగల కాలమును దేశారాధనకోసమై వినియోగింపవలెనని దీక్ష పట్టెను. ఈవలఁ జదువులలో మునిఁగియున్నను – అది యొక 'గౌణవృత్తి'గాఁ జిత్తమున భావించును. ఒక్కొక్కవేళలో దేశభక్తిచేఁ బారవశ్యమందెడి యా విద్యార్థికిఁ జదువుటకుఁ దీరికయే చిక్కదాయె. ఇరుగుపొరుగువారి మేలుగీడులే తన మేలుగీడులు. తన సంఘముశ్రేయమే తనకు శ్వశ్రేయసము. తన దేశము వికాసమే తన జీవితము వికాసము. ఈ ధోరణిలో నాతఁడు మధ్యమశ్రేణి విద్యార్థిగా గణనకు వచ్చుటలో నబ్బుర మేమున్నది? భావి జీవితమునకుఁ గావలసినంత 'యుపాధి' యా దశలోనే యలవడుట యందఱకు దొరకని యమూల్య నిక్షేపము.

విద్యార్థిజీవితము ముగియకమున్నే మదనమోహనుఁ డొకప్రక్క 'హిందూ సంఘ' మను పేర సాంఘిక సంస్థను నెలకొల్పెను. మఱొక వంక 'ప్రయాగ సాహిత్యసంస్థ' యని

విద్యాసంస్థను సైతము స్థాపించెను. ఆ రెండింటిమూలమున నాతని కా దశలోఁ గలిగిన విఖ్యాతి యింత యని చెప్పఁ దరము గాదు. బంగారునకు వాసన యబ్బినట్టులు - ఆ విద్యార్థి ప్రాథమిక జీవితములోనే మంచిగుణములు మప్పికొనెను. దేశారాధన కప్పుడే బీజావాపము వైచినట్లాయెను.

విద్యార్థిగాఁ జదువు ముగిసినవెంటనే మదనమోహానుఁ డలహాబాదులో - ప్రభుత్వపాఠశాలలో నుపాధ్యాయుఁడుగాఁ గుదిరెను. మూఁడేండ్లపాటు ముచ్చటగాఁ దన వృత్తిలో మురిపము సూపుచు నొడలు దాఁచుకొనకుండ పిల్లలకుఁ జక్కఁగాఁ జదువులు చెప్పెను. ఏఁబది రూప్యములతో నోంకారము చుట్టిన యా యుద్యోగము కొన్నాళ్ళకే డెబ్బదియైదుదాఁకఁ బెరిఁగిపోయెను. కాని యదియే జీవిత పరాయణమని యా మోహములో నాతఁడు పడిపోవలేదు. నిచ్చలు సాంఘికసేవలోఁ గాలము వెచ్చపెట్టుచుండును. సమయము చిక్కినప్పుడెల్ల దేశసేవాభాగ్యమునకే మోజు పడి పరవళ్ళు త్రొక్కెను.

చదువుల బడిలోఁ గొలువు కుదిరియున్నను మదన మోహానుని దివ్యకీర్తి దేశము నాలుగంచులలో వ్యాపకము నకు వచ్చెను. ఆతఁడు భృతకోపాధ్యాయుఁడే యయ్యు నొకతూరి భారతజాతీయ మహాసభకు హాజరయ్యెను. ఆ సభలో నేదో ప్రస్తావము వచ్చి తా నెన్నఁడు పరతంత్రుఁ డను గానని యు స్వేచ్ఛా జీవిననియుఁ బెద్దలమ్రోల గద్దించి చెప్పెను. అది జరిగిన కొన్నాళ్ళకే 1886 యేఁట-కాంగ్రెసు సభ్యునిగా నాతనిని దేశ మెన్నుకొనెను.

ఆ రోజులలో రాజా (శ్రీ)రామపాల్ సింహో యను మహావ్యక్తి 'హిందూస్తాన్' పత్రికను బ్రకటింపసాగెను. మాళవ్యా దేశభక్తికి ధర్మతత్పరతకు ముగ్ధుఁడైన యా సింహో తన పత్రికకు సంపాదకుఁడుగా నుండవలెనని మదన మోహానుని గోరెను. అన్ని వృత్తులలో నధ్యాపక వృత్తి సర్వోత్తమ మనియు సర్వదానములలో విద్యాదానము విశిష్ట మనియు మదన మోహానుని గాఢవిశ్వాసము. అట్లయ్యు దేశారాధనమే సర్వాతిశాయిగా మనస్సులో మెదలి ప్రజా శ్రేయస్సున కియ్యదియు మంచిబాటగాఁ దోఁచి పత్రికా సంపాదకత్వమునకు సమ్మతించెను. రెండునర యేండ్లపాటు - ఆ పనిలో మదనమోహానుఁడు లీనమయి యత్యద్భుతమైన సంపాదకీయములతో-ఆ పత్రిక నొక యుచ్ఛస్థితికిఁ దెచ్చెను. ఆద్యంత మా వ్యాసములలో దేశభక్తి పెనవైచికొని యుజ్జ్వల విజ్ఞానదీపమును వెలిగింపఁజొచ్చెను. ఔచిత్య సుందరముగా సాంఘిక సేవను బ్రబోధించుచు దేశమున కీ పత్రిక చేసిన మేలు మేలుతరమై భాసించెను. అనతి కాలములోనే మదన మోహానుని యకుంఠిత దేశభక్తి-స్వార్థమన్నది లవలేశ మేని యే కోశములో నెఱుఁగనేరని దేశసేవ ప్రజలను ముగ్ధులను గావించెను. ఆతని సాహచర్యమునఁ జేసియు నాతఁడొనర్చిన ప్రబోధములు వినియు దుర్వ్యసనములు మానినవారును బెక్కురు కలరు.

కాలక్రమమున మదనమోహానుని దృష్టి హైందవ జాతి దుస్స్థితిపయిఁ బ్రసరింపఁజొచ్చెను. ప్రపంచములో ముక్కాలు మువ్వీసము కన్న తెలివని రోజులలోఁ దన

యఖండజ్యోతిని వెలయించిన భారతఖండము నేఁడు చెన్ను దఱిగిపోయెనే యని మాళవ్యా విచారపడును. నిద్రాణ దశలోనున్న యీ భారతజాతిని మేలుకొలుపను మార్గమే లేదా యని రేయుంబవ లాతని కొకటే యాందోళనము. మందకొడిగాఁ బడియున్న యీ జీవమునకు జనసత్వము లెట్టులు కూర్పవలెనా యని యొక్కటే బెంగ. ఆ భావమే మనస్సులోఁ బనిచేసి 'అభ్యుదయ' మనుపేర హిందీపత్రిక నొక్కటి యారోజులలో నాతఁడు ప్రకటింపఁ జొచ్చెను. అది ద్వైవారపత్రికగా వెలువరింపవలయునని యాతనికి సంకల్ప ముండెనుగాని కావలసిన సొమ్ము చేతిలో లేక యా కోరిక కొనసాగలేదు. ఉన్నంతలో – ఆ పత్రిక దేశము నకుఁ జేసిన సేవ చిరస్మరణీయమైనది. ఏక దేశముగాఁ గాక యావద్భారతమునకు మిక్కిలి సేవ చేయవలెనన్న గాఢసంక ల్పము మాళవ్యా హృదయములో నాటుకొనెను. దానిని బట్టియే యాతఁడు 'లీడరు'– అను నాంగ్ల దినపత్రికకు నుత్సాహ ప్రోత్సాము లీయఁజొచ్చెను. ఆతని సహకారమునఁ జేసియే యా పత్రిక పత్రికారాజమై హైందవములో మంచి పేరు ప్రతిష్ఠలు పొందెను.

భారత జాతీయ మహాసభ స్థాపించుటకు మున్నే భారతదేశమున కాప్తులై పేరుపొందిన వారిలోఁ బరదేశీ యులు కొందఱు కలరు. వారిలో–ఏ. ఓ. హ్యూమ్, అను మహామహుఁ డగ్రగణ్యుఁడు. ఇతఁడు స్కాట్లాండు దేశీ యుఁడు. ఐ. సి. యస్ యుద్యోగియై హైందవములో నీతఁడు పెక్కు హోదాలలో మిక్కిలి పేరు పొందెను.

అధికారిగ ననధికారిగ నరువదియేండ్లుగా నీతఁ డీ దేశమునకుఁ జేసినసేవ చెప్పఁదరముగాదు. ఈతఁడు మదనమోహానునిలో నివురుగప్పియున్న జవసత్వములను గని పెట్టెను. ఒకనాఁడు మదనమోహానుని బిలిచి యల్. యల్. బి పరీక్షకుఁ బోయి రమ్మని ప్రోత్సహించెను. నిజమున కీ న్యాయవాది వృత్తి మాళవ్యాకు మనస్కరించినది కాదు. కాని పండిత-అయోధ్యానాథుఁడు సుందరలాల్ మున్నగు మిత్రులుసైత మా ప్రయత్నములో బలవంతపెట్టిరి. వారి పోరు పడలేక మదనమోహానుఁ డా పరీక్షకుఁ గూరుచుండెను. దానికోసమని యప్పుడు 'హిందూస్తాన్' పత్రికా సంపాదకత్వమునకు 'స్వస్తి' చెప్పలేదు. 1891_వ సంవత్సరములో యల్.యల్.బి. పరీక్షలో నుత్తీర్ణుఁ డాయెను. ఆవల రెండేండ్లకు హైకోర్టులో న్యాయవాదిగా నడుగు వెట్టెను.

అప్పుడు హ్యూమ్‌దొర మాళవ్యాను జేరఁబిలిచి యభిమానముగా నిట్లని బుజ్జగించెను :— మిత్రమా, భగవంతుఁడు నీకు మంచిజ్ఞానము నిచ్చినాఁడు. నా మాట విని నీవు పదేండ్లపాటు న్యాయవాదివృత్తిలో స్తిమితపడి యుందువేని నీ వెంతో సమున్నతస్థాయికి రాఁగలవని నా యాశ. నీ పేరుప్రతిష్ఠ లప్పుడు పదిమందికిఁ దెలిసిపోవును. కావలసిన సొమ్ముసైతము చేతిలో దండిగాఁ గుదిరియుండును. అప్పుడు నడుము గట్టి దేశముకోసమై యెన్నో తీరులఁ బాటుపడవచ్చును.

ఈ మాటలకు మదనమోహానుఁడు కాదనలేదుగాని యా వృత్తిమాత్ర మాతనికి బొత్తిగా గిట్టదాయె. దేశ

మును విడిచిన న్యాయవాదివృత్తి యాతనికి రోఁతగాఁ దోఁచెను. సంఘసేవలో మునిఁగిపోయిన యా జీవికి-కోర్టులోఁ గాలువెట్టుటకే తీరిక చిక్కదాయె. కాఁగా నాతని విజ్ఞానమునకుఁ దోడు న్యాయశాస్త్రముకూడ ననుబంధముగా సంధింపఁబడుటయే యప్పటి పరమార్థము.

మదనమోహనుని విద్యార్థిదశలోనే దేశసేవాపరాయణత పరాకాష్ఠ నందుకొన్నది. విద్యాప్రచారము సైతము దేశసేవలో నొక యంశముగా స్వీకరించెను. ఆతని కదియు జీవితపరాయణమై పరిణమించెను. ఏ దేశములో విద్యాగంధము చాలినంతగా దొరకదో - ఆ దేశము దుర్దశ ననుభవించుచున్నట్లే లెక్క. నిరక్షరాస్యులగు దేశీయులకు సాంఘికముగా రాజకీయముగా నెన్నో యనర్థములు వాటిల్లును. విద్యాధికులు లేని దేశములో దేశభక్తి కుదురనేరదు. దేశభక్తి లేని దేశములో వీరజాతి యుద్భవింపనేరదు. వీరజాతి లేని దేశము నిర్గంధ కుసుమమువలె నిరర్థకమై నీరసించును. ఆపై-పారతంత్ర్యము దాపరించెనా యా దేశము-అధోగతికి నీడ్చుకొని పోవును. అచ్చముగా నప్పుడు యావద్భారత మా దశలోనే యుండెను. చిరకాలమునుండి యవిచ్ఛిన్నముగా వచ్చుచున్న యఖిలవిద్యలు మాసిపోవఁ జొచ్చెను. అనుస్యూతముగా సంక్రమించియున్న యాచార వ్యవహారము లడుగంటిపోవసాగెను. తుదకు భారతీయ విజ్ఞాన సర్వస్వము బూజువట్టిపోవుట కన్పట్టెను. ఎక్కడఁ జూచిన-కట్టుబొట్టులు విదేశ్యములే. స్వదేశములోని సర్వవస్తువులు రోఁత వేసిపోయెను. విదేశములోని దంతయు బంగారమాయె. ఈ

దశలో మన దేశములో 'తిష్ఠ'వేసి సర్వవిద్యలు నిర్ణయించు వారు విదేశ్యులే యయిరి. వారు-ఆడినది యాట; పాడినది పాట; పలికినది బంగారము. కీలకములగు పదవులలోఁ బెత్తన మంతయు విదేశ్యులదే. రాజకీయాధికారము లైనను దేశీయుల కిత్తురుగాని విద్యాధికారము మాత్రము బొత్తిగా దగ్గఱకు రానీయరు. చదువులను బట్టియే సామ్రాజ్యము నేలవచ్చునన్న మూలసూత్రము పాశ్చాత్యులకుఁ దెలిసి నంతగా-ప్రాచ్యులకుఁ దెలియదాయె. ఆ కిటుకు కనిపెట్టియే పరదేశీయు లీగడ్డలోఁ బరవళ్ళు ద్రొక్కిరి. అది పట్టించు కొనని ప్రాచ్యులు పరతంత్రులై చివికిపోయిరి.

ఈ దుర్భరదారిద్ర్యమును గూర్చి హైందవములో జాతీయవీరులెందఱో యాందోళనము చేయఁజొచ్చిరి. అందు ముప్పాతిక మువ్వీసము సిద్ధహస్తుఁడై స్వదేశమును నుద్ధరించి నది మదనమోహనమాళవ్యా యన్నచో నతిశయోక్తి కాదు. భారతదేశము నిరక్షరాస్య మన్నమాట మాసిపోవల యునని మాళవ్యా పట్టుదల. విజ్ఞానజ్యోతి యింటింట వెలిఁ గింపవలయునని యాతని దీక్ష. ప్రయాగలో నాతఁడు సాహిత్య సభలు - విద్యార్థి 'వసతి' గృహములు మెల్ల మెల్లగా సాగించెను. పెద్దయెత్తున యావద్భారతమునకు మొత్తముగాఁ బనికివచ్చు గొప్ప విశ్వవిద్యాలయమే స్థాపింపవలయునని మదనమోహనుని సంకల్పము. అందలి పరమార్థ మిది:—

ఆ సంస్థలోఁ గాలువెట్టిన ప్రతివ్యక్తియు శారీరకముగా మానసికముగా నైతికముగా మంచి వికాసము పొందవలెను.

ఒక్క సాహిత్యమే కాదు; శాస్త్రమే కాదు; సంగీతము చిత్రము శిల్పము మున్నగు లలితకళలుకూడఁ గోరినవారికిఁ గోకొల్లలుగ నేర్పవలెను. ఆ చదువులలో నారితేఱి విశ్వవిద్యాలయము విడిచి వచ్చిన వెనుక-ఆ విద్యకు సార్థకత యుండవలెను. అన్నేండ్లు కష్టించి వ్యాసంగము చేసిన యా వ్యక్తికి విలువ మిక్కిలిగాఁ గట్టవలెను. అతఁడు నాలుగు రూకలు గడించుటలో మొనగాఁడగుటయే కాదు; నైతికముగా మిన్న యనిపించుకొనవలెను. సర్వసద్గుణములలో సర్వశ్రేష్ఠుఁడని యెన్నిక కెక్కవలెను. ఇట్టిది మాళవ్యా ధోరణి.

ఈ ధోరణిలో 'హిందూ విశ్వవిద్యాలయ' ప్రస్తావన మున్ముందట 1904-1905 సంవత్సరములలో వచ్చినది. కాని యప్పుడు దాని కొక యాకృతి యేర్పడలేదు. ఆవల 1909 లో 'అలిఘర్ యూనివర్సిటీ' స్థాపింతురని వదంతి యేర్పడెను. ఆ మఱుసటియేఁడు మఱల హిందూ విశ్వవిద్యాలయ ప్రస్తావము రేకెత్తెను.

ఇంతలో డాక్టరు-అనిబిసెంటను పాశ్చాత్య విదుషీమణి భారతదేశములో విద్యావిషయమయి బ్రహ్మాండమైన యొక సంకల్పము వెలువఱిచెను. చక్రవర్తి యనుమతి గైకొని యీ దేశములో సర్వశ్రేష్ఠమైన విశ్వవిద్యాలయము స్థాపింపవలెను. అంతర్జాతీయముగా దానికి గొప్ప విలువ చేకూర్పవలెను. ఈ దేశములోని కళాశాలలు విశ్వవిద్యాలయములు దాని కనుబంధ సంస్థలుగాఁ జేసి విద్యావిషయమున దేశ మంతయుఁ గేంద్రీకరింపవలెను. ఈ ప్రణాళికతో నామె మంచి

ప్రయత్నమే చేసెనుగాని యనేక కారణములవలన నామె కోరిక కొనసాగలేదు.

ఆ తరుణములో మదనమోహనుఁడు నడుము కట్టి హిందూవిశ్వవిద్యాలయము నావశ్యకమునుగూర్చి ప్రచుర ప్రచారము చేయసాగెను. మున్ముందు మాళవ్యా, సుందరలాల్ వద్దకుఁ బోయి తన సంకల్పముమాట చెప్పి, యా సంస్థలో మంత్రిత్వమును స్వీకరింపవలెనని యాతనిని గోరెను. ప్రభుత్వము సమ్మతింపనిదే యా సంస్థలో నుద్యోగము చేయఁ జాలననియు-ఆ సంస్థను స్థాపించుటకు మున్ను దొరతనమువారి యనుమతి యవశ్యము తీసికొనవలెననియు సుందరలాల్ కొంతవట్టు-అడ్డుపుల్ల వైచెను. మాళవ్యా మనస్సు చివుక్కుమనియె. అయ్యు నాతఁడు నిశ్చయము విడువనేరని నిపుణమతి కావున రివ్వున-కలకత్తా పట్టణము నకుఁ బ్రయాణము కట్టెను.

అచ్చట, హిందూవిశ్వవిద్యాలయమును గూర్చి యద్భుత ప్రచారము కావించెను. దాని మేలు గీడులు సాధక బాధకములు సమన్వయించి చక్కఁగా-ప్రబోధించెను. విదేశీయులు నేర్పెడి విద్యలవలన మాతృభాషలోని మమకారము సన్నగిల్లుటయే కాదు; సార్వకాలికముగా భారతీయులు బానిసీలుగా బ్రదుకవలసి వచ్చునని హెచ్చరించెను. పాలక జాతిలోని మేలును గైకొని పరభాషలలోని మెఱుఁగులు తెచ్చుకొని మనదేశము నుద్ధరించుకోవలసి యున్నదని నొక్కి వక్కాణించెను.

ప్రజల కది యొక మేలుకొలుపుగాఁ దోఁచెను. యువజనమున కది యొక యుత్తేజనము కూర్చెను. విత్తవంతులా మాటలకు మురిసిపోయిరి. లక్షాధికారు లుత్సాహముతో ముందునకు దూఁకిరి. విద్యాధికులలో నుల్లాసము వెల్లివిరిసెను. వందలు కాదు; వేలూ కాదు; లక్షలతరబడి విరాళములు వచ్చిపడెను. ఎందఱో పుణ్యాత్ము లీ ఘట్టములో వదాన్యశిరోమణులై వన్నెకెక్కిరి. హృదయపూర్వకముగ నెందఱో ముందునకు వచ్చి శక్తికి మించియు దానము చేసిరి. ఎక్కడఁ జూచినను మాళవ్యాకు సుస్వాగతములె. ఆదిభిక్షువు తరువాత-అంతవాఁ డీ దేశములో మాళవ్యా - ఒక్కడే యని యెందఱో పెద్ద లభినందించిరి. ఈ ఘట్టములో బికనీరు మహారాజు చేయి పెద్దచేయియై పేరు తెచ్చెను.

హిందూవిశ్వవిద్యాలయము - ఒక స్వరూపమునకు వచ్చుచుండఁగా మఱొక యంతరాయ మవతరించెను. అప్పటి యిండియా - మంత్రి యొక రీ విషయమై మాళవ్యాతో ముచ్చటించుచు నిట్లులనియె:- ఓ హెూ! మీరు హిందూ విశ్వవిద్యాలయము స్థాపింపఁబూనుట చాల సంతోషింపవలసిన విషయమే. అందు బోధించు భాషమాత్రము ప్రాంతీయమే యయినచో దానికి - ప్రభుత్వ మొప్పుకొనదు. ఆ చదువు లన్నియు నాంగ్లభాషలోనే విధిగా బోధింపవలెను. అప్పుడుగాని మీరు నేర్పు విద్యలకు విలువకట్టము. మీ విద్యాపీఠములో మా శాసనము ప్రకారము మా భాషయే నడచినచో మాచేయి పైచేయిగా నుండును. అది కాక, మీ సంస్థలో మీరు మీభాషలో బోధింతురేని-ఆ రహస్యము

మా కేమి తెలియును ? ఆ చదువులవంక తో మీ దేశీయులకు మీ రేమి నూటిపోసెదరో మా కేమి యెఱుక ? అంతయై యింతయై తుద కా విధానము మా కొంప కే యెసరు పెట్ట వచ్చునుగదా ! కావున మీ సంస్థలో-ఆంగ్లభాషను బోధనా భాషగాఁ బ్రవేశపెట్టనంత కాలము దొరతనమువారి యను మతి మీకు దొరక నేరదని గట్టిగా నమ్మవలెను.

ఇది - ఆ యుద్యోగుల ధోరణి. దానికిఁ దగినట్టులు మాళవ్యామిత్రులును గొందఱు పోనీయని యాంగ్లభాష కే పట్టుపట్టిరి. మహాసంకల్పమునకు వికల్పము రానీయరాదని మాళవ్యాకుఁ దోఁచెను. సరే చూత మని యప్పటి కా మహామనుఁడు తాను స్థాపించిన విశ్వవిద్యాలయములో - ఆంగ్లభాష నే బోధనాభాషగా నిర్ణయించెను.

డాక్టరు - అనిబిసెంటు, ఈ విశ్వవిద్యాలయము విషయమై యెంతో పాటుపడెను. ఈమె విదేశీయు రా లయ్యు - ఈ దేశమునకుఁ జేసిన సేవ యింతయని చెప్ప లేము. హైందవరాజకీయములలో నీమె యందెవేసినచేయి. దివ్యజ్ఞానసమాజములో మకుటములేని మహారాజ్ఞి. విద్యా రంగములో విద్వజ్జనులకే తలమానికము. పత్రికాప్రచురణ ములో - ప్రభుత్వమునకు గుండెబెదరు పుట్టించిన దిట్ట. ఉపన్యాస ధోరణిలో నీమె కీమెయే సాటి. సర్వతోముఖ ప్రతిభాశాలిని యగు నీమె నొకతూరి భారతదేశము భారత జాతీయమహాసభ కధ్యక్షురాలుగా నెన్నుకొనెను. భారతీయు లలో నెంద ఱెందఱో యీమె యుద్యమముల కండదండలై - అనుయాయులై - ఆత్మీయులై వన్నె కెక్కిరి. అట్టి మిత్ర

కోటిలో మాళవ్యాసయిత మొక్కఁడు. ఆతఁడు తలపెట్టిన యుద్యమమునకు నీమె జోక్య మగ్గలముగా నుండితీఱవలెను.

పట్టుమని ప్రయాణము కట్టి యీమె కలకత్తాలో మకాము పెట్టెను. హిందూవిశ్వవిద్యాలయమునుగూర్చి యీమె యా పట్టణములో ముచ్చటగా మూఁడుపన్యాసము లిచ్చెను. దానితోఁ బ్రజ లెగఁబడి ముందునకు వచ్చిరి. వశీకరణ మంత్రమునకువోలె నెల్లవారు ముగ్ధులై పోయిరి. గుప్పిళ్ల కొలఁది సొమ్మును గ్రుమ్మరించిరి. అప్పుడప్పుడే యా ప్రజలు—అయిదులక్షల రూప్యములు ప్రోవుచేసి యా సంస్థకై సమర్పించిరి. గౌరీపూజమీాందారు — శ్రీ వ్రజేంద్రరామకిశోర్ — శ్రీ రాధాకుముదముఖర్జి — శ్రీ వినయకుమారజీ మున్నగు పెద్ద లెందఱెందఱో నడుము కట్టుకొని వంగదేశములో నీ విద్యాలయమునుగూర్చి యెంతో ప్రచారము చేసిరి. వారి బోధలు చెవి కెక్కి యా సంస్థమీాఁద మమకారము పెరిఁగి ప్రజాసామాన్యముసైతము చక్కఁగా ధనసహాయము కావించెను.

ఒక్క వంగదేశమందే కాదు; పాట్నా — ముజ్జఫర్‌పూర్ — భగల్పూర్ — దర్భాంగా — కాశి — ప్రయాగ — అమృతసర్ మున్నగు మహాపట్టణములలో — ఈ హిందూ విశ్వవిద్యాలయమునుగూర్చి ప్రచార మమితముగా సాగినది. ఇంచుమించు — ఈ 'సమస్య' యావద్భారతము నోళ్లలో వేనోళ్ల మ్రోగిపోయెను.

ఒకసారి ముజ్జఫర్‌పూరులో బిచ్చకత్తె యగు 'పాకీ' వనిత యొకతె యీ మాట విన్నదఁట, అప్పు డభిమానము

పుట్టుకొనివచ్చి-అందాఁకఁ దాను గూడఁబెట్టుకొన్న -
యింత మొత్తమును విశ్వవిద్యాలయమునకు దానమిచ్చి
సంతృప్తిపడియుండెనఁట. అట్లే వేఱొకవ్యక్తి యీ సంబరము
పట్టలేక యొంటిమీఁదఁ జిరిగియున్న బొంతను దీసి యిచ్చి
సంతోషపడెనఁట. ఇట్లెందఱో పుణ్యాత్ములు కూటికి గుడ్డకు
లేని కటికి పేదలు సైతము-ఆవేశమెత్తి యంతయో
యింతయో తృణమో పణమో చేతికిఁ జిక్కినది యిచ్చి
హిందూవిశ్వవిద్యాలయముపట్ల భక్తిశ్రద్ధలు వెల్లడించిరి.

ఆ ప్రజ లిచ్చిన ప్రతివస్తువును మాళవ్యా, వేలము
వేయును. ఆ వస్తువులో విలువమాట యెట్లున్నను-ఆ సంస్థ
నభిమానము కలిగి వేలమువెఱ్ఱిగాఁ బ్రజలు విఱుగఁబడి
వత్తురు. వచ్చి, మాళవ్యా పెట్టిన పాటలోఁ బెద్దమొత్తము
నకే పాట పెంచెదరు. పైగాఁ బాట పాడి పాడినసొమ్ము
మాళవ్యాచేతిలోఁ బెట్టి యీ వస్తువుసైత మాతనికే
సమర్పింతురు. ఆతఁ డన్నియు సేకరించి యొక 'కేంద్రములో'
భద్రపఱుచును. ముజ్జఫర్పూరులో నొక 'బెంగాలీ' వ్యక్తి
యెన్నోవేలరూపాయలు దానమిచ్చెను. ఆతని ధర్మపత్నియుఁ
దనచేతి కున్న బంగారుగాజును మాళవ్యాచేతిలోఁ బెట్టెను.
వెంటనే యీమె పెనిమిటి దానికి ద్విగుణీకృతముగా విలువ
గట్టి యీ సొమ్ము మాళవ్యాచేతికిని - ఆ వస్తువు భార్య
చేతికి నిచ్చెనఁట. వెండియు నామె యుల్లాసముతోఁ జేతికి
వచ్చిన యీ వస్తువును మాళవ్యాకు సమర్పించెను.
మాళవ్యా దానిని - కేంద్రమునకుఁ బంపెను. ఇట్లనేకు
లనేక రీతులుగా దానములు ధర్మములు విరాళములు

బహూకృతులు బాహాటముగా నీ విశ్వవిద్యాలయమునకు సమర్పించిరి.

ఈ విద్యాసంస్థ కివ్విధిని గావలసిన సొమ్ము-ఒక రూపముగా వచ్చినపిదప మదనమోహనమాళవ్యా, యప్పటి రాజప్రతినిధి లార్డ్ హార్డింజితోఁ గలసి మాటాడెను. ఆతఁ డీ విశ్వవిద్యాలయమున కామోదముద్ర వేయుటలో సౌముఖ్యము చూపెను. ఆవల లాలా లజపతిరాయిని గలిసికొని యీ సంస్థవిషయమై చేయవలయు మార్పులు కూర్పులు నిర్ణయించెను. పంజాబులో లజపతిరాయి యొక సింహము వంటివాఁడు. ఆతఁ డొక మహోదాత; సంఘసంస్కర్త; జాతీయవాది. రాజకీయముగా సాంఘికముగా నాతఁడు చేసిన నిరంతరసేవవలన నొక్క పాంచాలమందే కాదు; యావద్భారతములో నాతని కొక పెద్దగద్దె నిచ్చి లోకము భూషించినది. ఆతఁడు నీతఁడు కలిసినచో గంగాయమునా సంగమమే. పవిత్రతలోనే కాదు; ప్రవాహములోసైత మా తీవ్రత-ఆ యుద్వేగము చెప్పఁదరము గాదు. ఆ యిరువురు పట్టిన పట్టులోఁగూడ గట్టిదనమే కానవచ్చును. ఆపై-పండితసుందర లాల్ కూడ-ఆ విద్యాసంస్థకు మంత్రిగాఁ గుదురుకొనెను.

1916 ఫిబ్రవరి నాలవతేదిని-కాశీపట్టణములో నీ మహావిశ్వవిద్యాలయమునకు శంకుస్థాపనము చేసిరి. లార్డ్ హార్డింజి చేతిమీఁదుగా-ఆ తంతు-అంతయు ముగిసినది. వైదిక యుగమునుండియు వారణాసి మహాపట్టణ మని మంచిపేరు వహించినది. సర్వశాస్త్రములు సాంగోపాంగముగ నధ్యయనము చేయఁబడుటచే-అది యొక గొప్ప విద్యాపీఠమై భార

తీయవిజ్ఞానమునకు మూలకందమై భాసిల్లుచున్నది. ఆ విఖ్యాతి నీ విశ్వవిద్యాలయము చక్కఁగా నిలఁబెట్టుకొన్నది. నాఁటికి నేఁటికి నీ సంస్థమూలమున-ఆ పట్టణమున కా ఖ్యాతి దక్కనే దక్కినది.

ఆ ప్రారంభోత్సవ వైభవము వర్ణనాతీతము. ఆ పట్టణములో 'నగవా' యనుచోట విశాలమైన ప్రదేశము నాలు లక్షలు పెట్టి విలిచిరి. అక్కడ విశ్వవిద్యాలయ భవనములకుఁ బునాది వేసిరి. ఆ మహోత్సవము చూచి యానందింపను వచ్చుటికి వచ్చినవారిలో రాజులు మహారాజులు రాజాధిరాజులు పెక్కురు కలరు. ఒకవంక మహామహుఁడగు కాశ్మీర మహారాజు. వేఱొకవంక సర్వాభరణభూషితుఁడగు బికనీరు ప్రభువు. ఇంకొక చక్కి దర్ప ముట్టిపడుచున్న 'దతియా' భూపాలుఁడు. వారి వేషములు వైఖరులు వింత గొలుపుచుండును. పట్టు పాజామాలు తొడిగి, పట్టు-అంగరఖాలు దాల్చిరి. మెడలో వజ్రాల హారములు. బాహువులలో బాజుబందులు. విలువ గల తలపాగలపయి వెలలేని ముత్యాలు సొగసైన వజ్రాలు పొదిగిన కలికితురాయులు. ఆపై - నడుమునందు బంగారుపిడి కల కరవాలములు. వారికి నీవల నావల ఢిల్లీ ప్రభుత్వములో నొల్లమాలిన యుద్యోగములలోఁ బేరుమోసిన మోతుబరులు. మదనమోహన మాళవ్యా, రావలెనని పట్టు పట్టుటచే మహాత్మా గాంధిజీ సైతము- ఆ దర్బారునకు వచ్చెనఁట.

విద్యావ్యాసంగమున కనువగునట్టులు పట్టణమునకు దూరముగా - ఆ ప్రదేశ ముండును. ఆరోగ్యము సౌభా

గ్యము సౌఖ్యము విశ్రాంతి యాలోచించియే మాళవ్యా దానిని నిర్ణయించెను. ఇఁక భవననిర్మాణ సందర్భము - అది యొక పెద్దఘట్టము. ఎందఱో వాస్తుశాస్త్రజ్ఞులను బిలిపించిరి. ఎన్నెన్నో నమూనాలు సేకరించిరి. రావలసిన కళాకారులు కావలసిన పరికరములు సర్వము సంసిద్ధమాయెను. ఆ యేఁడే యెన్నో భవనములు ప్రారంభించిరి. ఆర్ట్ కాలేజి - ఇంజనీయరింగ్ కాలేజి - రసాయనశాల - విజ్ఞానశాల - విద్యుద్భవనము నిర్మించిరి. ఒకప్రక్క కర్మాగారము - ఇంకొకవైపు, ఎన్నో విశ్రాంతిమందిరములు వేఱొకచోటఁ బఠనమందిరములు చక్కఁగా నెలకొనెను. ఆవల స్త్రీల కళాశాలలు. ఈవల ట్రైనింగ్ కాలేజి. మఱొక వంక-ఆయుర్వేదకళాశాల. విజ్ఞానము చేకూర్చు 'సినిమా' విభాగముసైతము కలదు. శిల్పవిద్య లెస్సగా నేర్పుటకయి సౌకర్యములు కూర్చిరి. ఆ పీఠములో శిల్పకళ నేర్చిన వారిలో మొనగాం డ్రెందఱో కలరు. రసాయనాది శాస్త్రములలో నారితేఱిన విద్వాంసులు నసంఖ్యాకులు కలరు.

ఈ మహాసంస్థను సృష్టించి యింత పెంచి పెద్ద చేసియు మాళవ్యా సంతృప్తి పొందఁడు. ఇంకను నేవేవో 'పథకము' లాతని హృదయములోఁ దగులుచునే యుండును. దేశమునుబట్టి కాలమునుబట్టి ప్రపంచపరిణామమునుబట్టి విజ్ఞానము పెంపుసొంపులలో వైవిధ్యము తోఁచుచుండును. ఇదియే చాలునని దీని పరిమాణ మింతయని బుద్ధిమంతులు హద్దు పెట్టబోరు. శాస్త్రమన్నది యనంతము. తెలియవలసినది దొడ్డది. బ్రదుకులు చాలఁ బరిమితములు. రుచులు

నిచ్చలు మాఱుచుండును. అరచేతిలో వైకుంఠము చూపి నట్టులు సూక్ష్మములో మోక్షము తెచ్చిపెట్టినట్టులు మంద బుద్ధులకు - ప్రబుద్ధులకు - సైతము విద్యావివేకములు నూఱిపోయవలెను. విద్యాగమము లేని దేశములో నిలువరాదని పెద్ద లందురు. ఆ దోషము మానుటకయి రేయుంబవలు మాళవ్యా కొక్కటే యాలోచనము. సంకల్పముపై సంకల్పము. ప్రణాళికలపై - ప్రణాళికలు. ఊహించిన దాని కొక రూపు వచ్చినదాఁక నాతఁడు నిద్రవోవఁడు. పలువురు దాని ప్రయోజనము పొందినదాఁకఁ బ్రయత్నము మానఁడు. ఇంత చేసితిమిగదా! ఇంక జాలునని యాతఁ డెన్నఁడు తనియఁడు; తలఁగడు. ఎవరో యడిగిరఁట! స్వామీ, కాశీ విశ్వవిద్యాలయ మింతటి మహోన్నతదశకు వచ్చెనే! మీ యనంతరము దీని నెవ్వరు పాలింతురో? అని. దాని కాతఁ డన్నది యిది:- బాబూ! దానికేమి? నిర్వహించువా రెందఱో ముందునకు వత్తురు. కాని విస్తృత మొనరించువారుమాత్ర ముందురో లేదో యని మాత్రమే సందేహము. అయినను మనము ప్రారంభించినపని నెఱవేరు దాఁకఁ బ్రయత్నము మానవలదుగదా! సంకల్పము మంచి దైన సత్ఫలితము దక్కితీఱును.

మాళవ్యా స్థాపించిన యీ విశ్వవిద్యాలయము కేవల మొక ప్రాంతీయసంస్థయని చెప్పరాదు. ఇది యావ ద్భారతమునకు - ప్రాతినిధ్యము వహింపఁగల మహావిద్యా సంస్థగా సిద్ధమాయెను. దీనికిఁ బోషకులు - ఉద్ధారకులు యావద్భారతములోని రాజులు-రాజాధిరాజులు. భారతదేశ

ప్రసిద్ధుఁడైన ఘనశ్యామదాసుబిర్లా, యీ విద్యాపీఠములో నొక పెద్ద 'భోజనవసతిగృహము' కట్టించి యిచ్చెను. మైసూరు - ఉదయపూర్ - జోధపూర్ - జయపూర్ - గ్వాలియర్ - ఇండోరు - కాశ్మీరు - పాటియాలా మున్నగు పరగణాలలోని ప్రభువు లెందఱో వార్షికభృతుల నిచ్చుచు సహకరింతురు. విశ్వవిద్యాలయప్రతినిధులుగా సెనేటు - సిండికేటు సభ్యులుగా దేశములోఁ బేరు మోసిన విద్వాంసులను మహానాయకులను - ఎన్నుకొందురు.

ఇచ్చటి ప్రాథమికపరీక్షను 'ఎడ్మిషన్' పరీక్ష యందురు. ఈ పరీక్షకై భరతవర్షములో వివిధ ప్రాంతములవారు పెక్కు పాఠశాలలనుండియు వత్తురు. విశ్వవిద్యాలయమే 'ఛాన్సలర్‌ను - వైస్‌ఛాన్సలర్‌ను - ప్రోఛాన్సలర్‌ను' స్వయముగా నెన్నుకొనును. ఇందు సభ్యులుగా రాజులు మహారాజులు నున్నను - పండిత మదనమోహనమాళవ్యాయే వైస్‌ఛాన్సలర్ పదవిలో నుండును. దేశమున కక్కఱకు వచ్చు సర్వశాస్త్రములను - ఈ విద్యాలయములో బోధింతురు. వ్యాసంగము ముగిసినపిదప యోగ్యతాపత్రము లిత్తురు. ఇందలి పట్టభద్రులను దక్కిన ప్రాంతములవారు చక్కఁగా మన్నింతురు. ఈ దేశములోఁ దక్కిన విశ్వవిద్యాలయములలోని విద్యార్థులవలె నిందలి విద్యార్థులు సైతము పదవులలో-పరిగణనకు వత్తురు. సంస్కృత భాషకుఁ జిరకాలమునుండియుఁ గాశీపట్టణమే కాణాచి. ఆ సంప్రదాయ మిప్పటికిని - ఈ హిందూవిశ్వవిద్యాలయము చక్కఁగాఁ బాటించుచున్నది.

ముమ్మొదట - ప్రభుత్వ మీ సంస్థకు లక్షరూప్యములు గ్రాంటుగా నేర్పఱిచెను. ఆవల మూఁడులక్షలకుఁ బెంచిరి. సర్వతోముఖముగ విశ్వవిద్యాలయమునకు వచ్చు నాదాయ మును సక్రమముగా వ్యయ పెట్టెదరు. దేశములో నలుదెసల నుండియు దిగ్దంతులవంటి పండిత ప్రకాండుల నేరికోరి తెచ్చు కొని యధ్యాపక పదవులలో నుంతురు. అధ్యాపకులకు - అధ్యేతలకుఁ జక్కని యానుకూల్య మేర్పఱిచి యొకే సంసారముగా - గొప్ప గురుకులముగాఁ గుదురుపఱిచిరి. బోధనాభాషావిషయమై యాదిలోఁ బ్రభుత్వము పెట్టిన 'అంకుశ' దీసివైచిరి. జాతీయనాయకుల ప్రచుర ప్రచారము మూలమున యావద్భారతములో హిందీభాష కొక ప్రాధా న్యము సిద్ధించినది. చక్కని సారస్వతము కలిగి యెంతో పేరు ప్రతిష్ఠలు పొందిన దేశభాష లీ దేశములో నెన్నో యున్నను మొత్తము దేశములో వ్యవహారములోఁ బెక్కు మంది హిందీభాషనే పలికెదరు. కావున హిందూవిశ్వవిద్యా లయబోధనాభాషగా హిందీనే నిర్ణయించిరి. హిందీని బోధనా భాషగాఁ దీసికొని యమ్. ఏ పరీక్షకు సైతమిచ్చుటఁ జదువ వచ్చును.

చతుష్షష్టికళలలోని సంగీతాది లలితకళలకు సైత మీ విద్యాలయములో గొప్పస్థాన మున్నది. సైనికశిక్షకూడఁ జక్కఁగా నిక్కడ జరిపింతురు. దీని కప్పు డొక యాంగ్లే యుని నియమించిరి. 'శివాజీ కాలేజి ఆఫ్ ఫిజికల్ కల్చర్' - అనుపేర మఱొక శాఖ నెలకొల్పిరి. అందు శారీరకముగాఁ బనికివచ్చు వ్యాయామవిద్యను నేర్పెదరు. ఈ తీరుగ సర్వతో

ముఖముగ సర్వవిద్యలలో నేఁటేఁట వేలకొలఁది విద్యార్థులు కీర్తిప్రతిష్ఠలు మూటకట్టుకొనిపోయి దేశము నాలుగు మూలలలో వెదఁజల్లుచున్నారు.

గాంధిజీ యొకసారి యీ విశ్వవిద్యాలయము ప్రాంగణములో నుపన్యసించుచు నీ మాటలు చెప్పెను :—

'భవ్యమైన యీ విద్యాసంస్థ మాళవ్యలవారి దివ్యకీర్తికి శాశ్వతచిహ్నము. ఈ మహామహుఁడు దేశమునకుఁ జేసిన యుపకారము లన్నింటిలో నిదియే దొడ్డది. వీరి సేవను భారతీయు లెన్నఁడో చక్కఁగా గుర్తించిరి. వీరి సేవా విశిష్టతను మహామహిమను నిరూపింపవలెనన్న - ఈ మహా విద్యాలయమే మంచి కొలతబద్ద. ఈ సంస్థలో వెలువడిన విద్యార్థుల శీలము చరిత్ర దేశసేవ దేశభక్తి స్వార్థత్యాగము, వీని నాధారము చేసికొనియే మన మీ విద్యాలయము విశిష్టతను నిర్ణయింపవచ్చును.

నేను మాళవ్యాజీకి భక్తుఁడను. భక్తుఁడు స్వామి గుణగణములు కొండాడుటలో నెన్ని మాటలు వాడినను - ఇంకను జాలలే దనిపించును. ఆయన మహామహిమను వర్ణింపను నా కలవికాని పని. 1890 లో విదేశములలో వసించు చున్న నేను హిందూదేశవార్తాపత్రికలలో మాళవ్యాజీముఖ చిత్రమును గాంచితిని. ఆ నాఁడు - ఆయనపట్ల నా హృదయములో ముద్రితమైన శ్రద్ధాభక్తులు నేఁటికి నట్లే నిలిచి యున్నవి. ఆయనలో నున్న యనంతమైన దివ్యశక్తి నన్నెంతో మంత్రముగ్ధుని జేసివైచినది. ఆయన వేషభాషలలో నాచారవ్యవహారములలో నొక విధమగు సారళ్యము

సాధుత్వము స్పష్టమగుచున్నది. యౌవనదశనుండి నేఁటి దాఁక-ఆయనలో నేవిషయములోఁగాని రవ్వంతయు మార్పు కానరాదు. ఆయనకు జన్మసిద్ధమైన దేశసేవా ప్రవంతి నేఁటికిని - అవిచ్ఛిన్నముగ ననుస్యూతముగ నమోఘముగ సాగుచునేయున్నది. ఈ హిందూవిశ్వవిద్యాలయ మను శరీర మునకు మాళవ్యాజీ పంచప్రాణములు. ఇట్టి మహామహుఁడు చిరంజీవియై వర్ధిల్లుఁగావుతమని దైవమును ప్రార్థించు చున్నాను'

మాళవ్యా జీవితములో ధర్మప్రవృత్తి పెనవైచుకొని యైహికముగఁ బారమార్థికముగ సర్వతోముఖవికాసము పొందినది. నీతినియమములలో విధినిషేధములలో నాతని విశిష్టత యడుగడుగునకు వెలువడుచుండును. ఆతఁడు హృదయపూర్వకముగ విశ్వసించి తోడివారికి బోధించు ప్రబోధములు - ప్రవచనములు నెన్నేనియుఁ గలవు. తాను భావించినవానినే యాతఁడు లోకులకు బోధించును. బోధించినదానినే యక్షరాలఁ దానును పాటించును. అట్టి మానిసిని జూచి లోకు లాదరింతు రనుటలో నబ్బుర మేముండును !

బుద్ధిబలమునకు దోహద మిచ్చు శరీరబల మత్యావశ్యకమని మాళవ్యా భావించినవాఁడు కావున-కాశీవిద్యాలయములోని విద్యార్థిబృందమున కెన్నో వ్యాయామశాలలు నెలకొల్పెను. సైనికశిక్షణయే గాక బాలభటోద్యమము సైతమాతఁ డంగీకరించి దాని కెన్నోరీతులఁ బ్రోత్సాహ మిచ్చెను.

మదనమోహానునకు విద్యాప్రచార మొక్కటియే జీవిత పరమార్థము కాదు. మతసంస్కరణ ఘట్టములోఁ గూడ నాతని చేయి యందెవేసిన చేయియే. హిందూ మతములో ననాదినుండియు నెన్నో మెఱుఁగులు గుబాళించుచున్నవనుట నిజమే. కాని, శాస్త్రము – ఆచారము, ఈ రెండింట ననేకవిప్లవములు పొడమి యాకున కందక పోకను బొసఁగక స్వైరవిహారము సేయుచున్నవి. ధర్మము పేరట మతము పేరట – అత్యాచారము లెన్నో యుద్భవిల్లినవి. శాస్త్రము చెప్పినదాని కర్థము తెలియక యెవరికి వారు గాఁ దలకొక త్రోవగా నడచిరి. మతమను వంకతో వేషభాషలలో 'భేషజము' బలిసిపోయి మూలచ్ఛేదమునకే మూలమాయెను. ధర్మసమన్వయము చేయలేక సూత్రార్థము విప్పి చెప్పలేక విభిన్నమార్గములను వెలయించిరి. అందును రాద్ధాంతసిద్ధాంతములు పెచ్చుపెరిఁగి వాదోపవాదములలో వైలక్షణ్య మంకురించెను. పరమార్థము గుర్తించుటలో దీక్ష తఱిగె. వాదము పెంచుటలో శ్రద్ధ పెరిఁగె. తత్త్వచింత యన్నది బొత్తిగా దూరమాయె. ఆచారమున కర్థము – ధర్మమునకుఁ దాత్పర్యము – శాస్త్రమునకు సమన్వయము కొంగ్రొత్తగా వెలయఁజొచ్చెను. ప్రత్యల్పవిషయమును మతమునకు ముడిపెట్టి యెన్నో దురాచారములను బాహాటముగఁ బ్రోదిచేసిరి. అంధవిశ్వాసముల కవధి లేదు. అభిప్రాయభేదముల కంతు లేదు. హిందూజాతి నలుమూలలోఁ జీలికలై వాలికలై చివికిపోయెను. వర్ణవ్యవస్థలో యువతీజనము విషయములో నన్యాయ్యములు పెక్కు లావిర్భ

వించెను. ధర్మసంస్థాపనార్థమయి యప్పుడపుడు మహాత్ము లవతరింతురు. వారి మార్గములో లోకము నడచి కొన్ని యేండ్లు చక్కఁగా బ్రదుకును.

మదనమోహనునకుఁ బూర్వము దయానందస్వామి వంటివారు హిందూమతోద్ధరణమునకై యెన్నెన్నో ప్రయత్న ములు చేసిరి. హైందవములోని చీలిక లాధారముగాఁ జేసి కొని విజాతీయులు హైందవజాతికి దెబ్బకొట్టిరి. లాఁతి విలా తుల సంస్కారముద్రయే హైందవములో హత్తుకొనిపోయెను. అడవిలోని నాలుగెద్దుల కథకు హైందవుల కథ యుద్ది యయ్యెను. ఈ దుఃస్థితిని మాళవ్యా చక్కఁగా గుర్తించి దానికిఁ దగిన చికిత్సను జేయఁదలపెట్టెను. కుళ్ళిపోయిన జాతికి – ఆరోగ్యము కలిగింపవలెనని యాతఁ డాందోళన పడెను. అప్పుడు పూర్వాపరములు విచారించి 'హిందూ మహాసభను' స్థాపించెను.

ఆ సమాజములో హిందువులలో నెవ్వరుగానీ సభ్యు లుగాఁ జేరవచ్చును. శాఖాభేదములు లేవు. సనాతనధర్మము చక్కఁగాఁ బ్రబోధించుటయే యా సమాజము పరమార్థము. మాళవ్యా, ప్రజలలోఁ జొచ్చి హైందవమునుగూర్చి యెన్నో యుపన్యాసము లిచ్చెను. అంటరానితనము మున్నగువానిని గెంటివేయవలెనని బోధించెను. దోసము లున్నచో సంస్క రించి యందఱ నొక త్రోవలోఁ బెట్టవలెనని యాతని దీక్ష. ఆతఁడు నైష్ఠికుఁడయ్యు లోకుల కెడముగా నుండక పూజా పురస్కారములలో జపతపములలో నందఱు పాల్గొనవలెనని ప్రబోధించెను. ఒకే మతమున నున్న వారిలో నొకకొందఱను

జిన్నచూపు చూచుటలో న్యాయము లేదని శాస్త్రీయముగ నాతఁడు వాదించును. కరచరణాదులలో దేనికి బాధ కలిగినను దేహి బాధపడునట్టులు మతములో నెవ్వరు బాధపడినను మతమునకే దెబ్బయని నిరూపించెను. హిందూజాతి నుద్ధరించి సనాతనధర్మమును బ్రోత్సహించి యందఱ నొక త్రాటిమీఁద నడపింపవలెనని యాతని పట్టుదల. ఈ దృష్టిలో నాతఁడు హైందవజాతికే ప్రతినిధిగా నడుము కట్టి నిలువఁబడెను.

ఒండొరులు విరోధములు మాని సోదరభావము నేర్చుకొనవలెను. మూఢాచారములు వీడవలెను. అంధవిశ్వాసము లంతరింప జేయవలెను. ఈ రీతిగా మాళవ్యా దేశీయులకు నూఁదిపోయుచు 'మహావీరదళ'మనుపేర మఱొక సంఘమును స్థాపించెను. ఆ సంఘములో సంఘసేవకులను సమకూర్చి వారికిఁ జెప్పవలసినవి చెప్పి వారిని దేశముమీఁదికిఁ బంపును. ఆరోగ్యము లేనివారు నలువురిలోఁ దల యెత్తికొని తిరుగలేనియట్టులు భేదములచే నీరసించిన జాతి సాటివారిలో గౌరవము సంపాదింపలేదని యాతఁడు బాధపడును. ప్రతివ్యక్తియు శారీరకముగా మానసికముగా స్వాస్థ్యము పొందియున్నచో—ఆ జాతి మొత్తముగా మంచి వైభవముతో రాణించునని యాతని యాశ. కావుననే యాతఁడు విద్యార్థులు కంటఁబడునప్పుడు — ఆరోగ్యము ముఖ్యమనియు వ్యాయామము మానవలదనియు నుద్ఘోషించును. ఆ రోజులలో—ఆ ప్రచారము వలన, పంజాబు – బొంబాయి – మధ్యప్రదేశ రాష్ట్రములలో వ్యాయామశిక్షణాలయము లనేకములు నెలకొల్పిరి.

1906–వ యేఁట – ప్రయాగలో 'సనాతనధార్మిక

మహాసభ' యొకటి స్థాపించిరి. దానికి మాళవ్యాను సభా
పతిగా - ఆ దేశీయులు వరించిరి. నాఁటినుండియు నాతఁడు
తన శక్తియుక్తులు సర్వము ధారవోసి యా సంస్థ ననుకూల
మైన త్రోవలో నత్యద్భుతముగా నడపించెను. ఆ బలముచేఁ
గొన్నియేండ్ల కా సంస్థ పెద్దగాఁ బెరిఁగి 'అఖిలభారత సనా
తన ధార్మికమహాసభ'గాఁ బరిణమించెను. ఎన్నోసారు లాత
నినే దాని కధ్యక్షునిగా నెన్నుకొనిరి.

ఒకసారి యధ్యక్షపీఠమునుండి యాతఁడు పలికిన
పలుకులివి :—

'యావద్భారతములో నొక్క హిందూజాతి తక్కఁ
దక్కినజాతు లన్నియుఁ దమతమ మతప్రచారములు
చక్కఁగాఁ జేసికొనుచున్నవి. పురోఽభివృద్ధికయి చేయ
వలయు ప్రయత్నము లన్నియుఁ జేయుచున్నవి. ముస్లిములు
చేయు మతప్రచారములో నాలవవంతు ప్రచారమే చాలు
హిందువులు చేసినచో - ఈ హిందూమత మిట్టి దీనదశలో
నుండునా ? ఆ విచారమే లేక మనము మౌనముగాఁ గూరు
చున్నాము. ఆ క్రైస్తవుల తీరు చూడుఁడు. వారి చొరవ
యేమని చెప్పవలె ? మంచినీటినివోలె సొమ్మును గ్రుమ్మరించి
రేయుంబవలు వారు మతప్రచారము చేయుచున్నారు.
ఒక్కఁడైనను మనవాఁడు నడుము గట్టుకొని జాతి నుద్ధ
రింపవలెనని ముందునకు రాఁడే! ఆ పంజాబు ప్రాంతములో
మాత్రము పాపము! కొందఱు హైందవజాతి దుఃస్థితి గుర్తిం
చిరి. హైందవములోఁ బ్రతివ్యక్తిని మేలుకొల్పవలెనని
దూఁకుచున్నారు. సనాతనధర్మసంస్థలు పెక్కింటిని స్థాపించి

మతప్రచారములో దీక్ష వహించిరి. అచ్చటి సంస్కృత పాఠశాలలందుఁగానీ కన్యావిద్యాలయములలోఁగానీ ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలలోఁగానీ గురుకులములలోఁగానీ బ్రహ్మచర్యాశ్రమములందుఁగానీ చక్కని ప్రచారమే జరుగుచున్నది. హిందూమతధర్మమునుగూర్చి విద్యార్థులకు లెస్సగాఁ బ్రబోధింతురు. శారీరకముగా మానసికముగా నుత్తేజకరమైన మంచివిద్యను బోధింతురు. మీరుసైత మదేరీతిగా హిందూమతపునరుద్ధరణమునకై మిక్కిలి పాటు పడవలసియున్నది.

ప్రతివ్యక్తియు ధర్మగర్భితములైన కథలను వినవలెను. విన్నవి యితరులకుఁ జెప్పవలెను. నిచ్చలు కోవెలకు వెళ్లుట-తీర్థములు సేవించుట-క్షేత్రములు దర్శించుట, ఇట్టి ప్రవృత్తికిఁ బ్రజల చిత్తవృత్తులను మార్పవలెను. అది యలవడెనేని ప్రజలకు ధర్మముపట్ల - అచంచలమైన భక్తివిశ్వాసములు కుదురును. అనాదినుండియు హైందవధర్మప్రచార మీ విధముగనే సాగినది. వైదికయుగమునుండియు దీని వాలక మిట్టిదే యగుట యందఱు గుర్తింపవలెను. దీనికి విరుద్ధముగా నీ నడుమ నెన్నియో ధర్మము లవతరించినవి; అంతరించినవి. కావున సనాతనధర్మము చక్కఁగా గుర్తెఱిఁగి సర్వకాల సర్వావస్థలలో దానిని గాపాడ వలసిన 'బాధ్యత' హైందవు లందఱియందును గలదు. సమాజములోఁ బుట్టిన క్రుళ్లును వెలికి నెట్టవలసినదే. అత్యాచారములుగాని యవినీతులుగాని బొత్తిగా సైఁపరాదు. రోగమునకుఁ దగిన చికిత్స చేయవలయునుగాని రోగిని మన మెన్నఁడు దూరీకరింపరాదు.

సమాజము నుద్ధరింపవలెనని భావింతువేని ముందు - ఆ సమాజమునెడ భక్తిశ్రద్ధలు చూపవలెను. సనాతనధర్మ మను పునాదిపై మన సమాజము నెలకొనియున్నది. ధర్మమున కేమాత్రమేని దెబ్బ తగిలెనా సమాజ మను భవనము సమూలముగ నేలఁ గూలును'

ప్రపంచము తెలిసినదిమొదలు మదనమోహానుని హృదయములో దేశభక్తి తాండవింపఁదొడఁగెను. అతఁడు తన జీవితసర్వస్వమును దేశమున కంకిత మొనర్చిన దివ్య మూర్తి. దేశారాధనమే జీవితపరాయణముగా భావించి దేశము దాస్యమును బాప నడుకట్టి యష్టకష్టము లనుభవించిన దేశోద్ధారకులలో మొదటిశ్రేణిలోఁ జేరినవాఁడు మదన మోహనమాళవ్యా. అతఁడు 1836-యేఁట, భారతజాతీయ మహాసభారంగములో నడుగువెట్టెను. ఆ యేఁడే కలకత్తాలో దాదాభాయినౌరోజి యాధ్వర్యవమున-కాంగ్రెసుమహాసభ జరిగెను. మహామహులైన పెద్ద లనేకు లా సభలోఁ బాల్గొనిరి. హోరాహోరిగ శరపరంపరగ నుపన్యాసములు వెల్లివిరిసెను. కాని యానాఁటి యుపన్యాసపరంపరలో మాళవ్యా మహోపన్యాసమును మించినది లేదఁట. దేశ భక్తితో మేళవించి దివ్యమై పరిఢవించిన మాళవ్యాసూక్తు లను విన్న శ్రోత లందఱు వీరావేశ మెక్కి పరవళ్లు త్రొక్కిరి. అందలి ప్రత్యక్షరము శ్రోతల హృదయములోఁ జొచ్చి చేయ వలసినపని చేసెను. ఆయేఁటి వార్షిక నివేదికలో-తన్మహాసభా కార్యదర్శి మదనమోహానునిగూర్చి యద్భుతముగాఁ బ్రశంసించెను.

దేశములోఁ గొందఱు కొన్నిరంగములలో మాత్రమే కృతహస్తులై యుందురు. సర్వతోముఖముగ నన్ని రంగము లలో నారితేఱి పేరుప్రతిష్ఠలు పొందిన మాళవ్యాను బోలిన వారు పెక్కురు లేరు. రాజకీయములలోసైత మతఁడధిష్ఠాన వర్గములోఁ జేరిపోయెను. ఆతని రాజకీయోపన్యాసము లొక వంక విప్లవము రేకెత్తించినను వినుటకు హృద్యములై యనవద్యములై సారస్యము గూర్చుచుండును. విన్నవారు కన్నవారు – ఆతని భావములు మూటకట్టుకొనిపోయి యెడదలో హత్తుకొని యాకళింతకుఁ దెచ్చుకొందురు. అడు గడున స్వాతంత్ర్యవాసనలు గుబాళించును. కాని, యా మాటలలో – ప్రభుత్వము పసిపట్టఁదగిన దోసములు కాన రావు. పెదవి మెదల్పుటకే వీలు లేని యా గడ్డురోజులలో మాళవ్యా యిచ్చెడి యుపన్యాసములు కొండపీటిచేఁత్రాడు వోలెఁ బెరిఁగిపోయెడివి. ఒక్క పలుకులోనైన నేరమి యారోపింపవలెనన్న నెవ్వరితరము కాదు. ఆ భాష యట్టిది. అప్పటి నాయకు లెవ్వరుగాని యుపన్యాసము లిచ్చిరేని – చట్టమునకు గిట్టని మాటలు, పెక్కులు గన్పట్టుచుండును. వెంటనే వారికి జైలుశిక్షలు సిద్ధమగును. అట్లని మాళవ్యా మాటలు ప్రభుత్వమున కింపితము లని భావింపరాదు. ఉద్యోగుల హృదయములో వేఁడి పుట్టించియుఁ జట్టమును జూపెట్టి వంకపెట్టి సాధించుట కయితి కానిది యా ధోరణి. అది ప్రజాసముదాయము హృదయములో మిక్కిలి ప్రభా వము చూపి నిలిచిపోవును.

అప్పటి దేశభక్తులలోఁ బ్రధానముగా రెండుపాయలు

కలవు. కొందఱు-అతివాదులు; మఱికొందఱు మితవాదులు. రెండవపక్షములో గోఖలేమున్నగు పెద్దలు నాయకులై పెత్తనము చేసిరి. మాళవ్యాసైత మా పక్షమునే యభిమానించి యా ధోరణిలోనే మెలఁగఁజొచ్చెను. అనఁగా-విదేశ్యప్రభుత్వ మిచ్చిన హక్కులు నధికారములు పుచ్చుకొనుచు లేనివానికోసము పోరాటము సలుపవలెనన్న వాదమే మితవాదుల నినాదము. అప్పుడు యావద్భారతములో మొత్తముగాఁ జూచిన రాజకీయనాయకత్వములో బొంబాయి వారిదే పైచేయిగా నుండెను. సంయుక్తప్రాంతములో - 'కాంగ్రెసు' కార్యకలాపములోఁ బాల్గొనుటలో నంతగాఁ జొఱవ కానరాదాయె. అప్పుడు సర్. హ్యూమ్‌ద్వార జోక్యము తీసికొనుటచే మదనమోహనుఁడు కాంగ్రెసు రంగములో దీక్ష వహించెను. ఆతఁడు నమ్మినదానిని విప్పి చెప్పుటలోఁ జెప్పినదానిని జక్కఁగా నాచరించుటలో మొనగాఁడని యప్పటికే పేరుమోసినవాఁడు కావున సంయుక్తరాష్ట్రములోఁ గొంత సంచలనము కలిగెను. ఆతని బోధలు విని తత్ప్రాంతమువారు తండోపతండములుగా - కాంగ్రెసులోఁ జేరిరి. అదిమొదల లాతఁ డొనర్చిన యమూల్యకృషివలన - ఆ రాష్ట్రములో - కాంగ్రెసునుద్యమము మిక్కిలి బలపడెను.

ప్రయాగలో జరిగిన కాంగ్రెసుమహాసభ కాహ్వాన సంఘాధ్యక్షునిగా మాళవ్యా నెన్నుకొనిరి. ఆవల-ప్రాంతీయ జాతీయమహాసభాధ్యక్షుఁడాయెను. 1909-వ యేఁట-యావద్భారత జాతీయమహాసభకు మాళవ్యా నధ్యక్షునిగా దేశ మెన్నుకొనెను. ఆరోగ్యము లేకపోవుటచే నాతఁడు దాని

నంగీకరింపఁడాయె. కాదని ప్రజలు బలవంతపెట్టిరి. తప్పని సరి కావుటచే నా దశలోసైత మాత్రఁ డధ్యక్షుపదవి స్వీకరించి చక్కఁగాఁ గార్యక్రమము నడపించెను.

దేశమునకు నష్టమును గష్టమును దెచ్చిపెట్టు నెట్టి చట్టమునుగాని నెట్టివైచుటలో మాళవ్యాపండితుఁడు దిట్ట. 'జలియన్ వాలాబాగులో జరిగిన 'ఘోరకలికి' యావద్దేశ మట్టుడికిపోయెను. ఆ దురంతములనుగూర్చి ఢిల్లీరాజ్యాంగ సభలో మాళవ్యా నిప్పులు గ్రక్కుచు ఘోషించినపుడు తెల్లదొరలు నిజముగాఁ దెల్లమొగము వైచి నిరుత్తరులై నిలిచిరి. మాళవ్యా వేయు ప్రశ్నలకు సమాధాన మీయఁ గల నాథుఁడే యా సభలోఁ గానరాఁడాయెను. దేశములో-పంజాబుహత్యలనుగూర్చి సమగ్రనివేదిక సిద్ధము చేయుట కయి మాళవ్యాతోపాటు మఱికొందఱిని జేర్చి కాంగ్రెసు వా రొక కమిటీని నిర్ణయించిరి. ఆ కమిటి చక్కఁగాఁ బరిశోధించి డయ్యరుసేనాని నాయకత్వములో జరిగిన దౌర్జన్యమును బూసగ్రుచ్చినట్టులు ప్రభుత్వమునకు విప్పిచెప్పి యా 'ఘోరకలి' కన్నులకుఁ గట్టినట్టులు చూపెట్టెను.

1931-వయేఁట గోరఖ్‌పూరులో జరిగిన దురంతములను- కాంగ్రెసుమెడ కంటఁగట్టి ప్రభుత్వము - చౌరీ చౌరా దురంతముల వంకతో గాంధిజీ కాఱేండ్లు కఠినశిక్ష విధించెను. అప్పుడు ప్రభుత్వముతో హోరాహోరిగఁ బోట్లాడి యా వర్గములో నలువురను దక్కఁ దక్కినవారి నెల్లరను విడిపించిన గొప్పతనము మాళవ్యాకే దక్కినది.

స్వదేశవస్తుస్వీకరణము విదేశవస్తుబహిష్కరణము

గూర్చి మదనమోహనుఁ డెన్నో వ్యాఖ్యానములు చేసెను. యావద్భారతములో - ఆ విషయమై ప్రచురప్రచారము కావించెను. తొమ్మిదవ కాంగ్రెసుమహాసభలో మాళవ్యా పండితుఁడు సభాసదులను హెచ్చరించుచు - ఈ మాటలు చెప్పెను:—

'బాబూ! ఆ నాఁటి మీ నేతవాండ్రు నేఁడెక్కడ నున్నారు? చేతిపనులలో నారితేఱి పరిశ్రమలమూలమున బ్రదుకనేర్చిన - ఆ పనివాండ్రందఱు నేఁడేమైపోయిరి? ఒకప్పుడు - ఇంగ్లాండునకే కాక తక్కిన యైరోపాదేశము నకు నేఁటేఁట నెగుమతి చేసిన మీ దేశీయపరిశ్రమల పరిస్థితి నేఁడెట్లున్నది? ఆ దివ్యమైన దేశీయమహాభాగ్య మంతయుఁ గాలగర్భములో లీనమై పోయెనా? ఈ మహాసభలోఁ గూరుచున్న ప్రతివ్యక్తియు - ఇంగ్లీషుదుస్తులలోఁ గాన వచ్చునే! మీ రెక్కడ నడుగువెట్టినను - ఇంగ్లీషువస్తువులు - ఇంగ్లీషుపరిశ్రమలు మీరాక కెదురుచూచునుగదా? కాఁగా నేఁడు మన ప్రజలకు మిగిలియున్న బండార మేమి? పండిన పంటలో నరకొఱగాఁ దిండి తిని వర్తకములో నేదో యింత నంజి బ్రదుకుటయే గదా! ఉద్యోగములలోఁగాని వ్యాపార సరళిలోఁగాని యర్ధశతాబ్దికిమున్ను మన దేశీయులు పొందిన లాభములో నేఁడు నూఱవవంతునకుఁగూడ నోఁచుకొన రైరే! ఇట్టి విషమఘట్టములో - ఈ దేశములోఁ బ్రజ లెట్లు సుఖపడెదరు? దేశ మెట్లు బాగుపడును?'

1930 - అగస్టు మొదటితేదిని బొంబాయిలో లోక మాన్య - బాలగంగాధరతిలకు జయంతిమహోత్సవము

జరిగెను. తన్మహోత్సవసందర్భములోఁ బెద్ద యూరేఁగింపు నడచెను. అప్పు డా పట్టణములో - అఖిలభారత జాతీయ మహాసభా కార్యసంఘ సమావేశములు జరుగుచుండెను. ఆ సమావేశమునకు వచ్చిన పెద్దలుసైత మా యూరేఁగింపులోఁ బాల్గొనిరి. మాళవ్యా - పటేలు - సెర్వానీవంటి యుద్దండులు ముందు నడువఁగా లక్షకు మించిన ప్రజలు బారులు తీరి నేల యీనినట్లు తోఁచెను. ఆ ప్రజాసందోహమును గాంచిన ప్రభుత్వమునకుఁ జిత్తము పాటుతప్పెను. అది చట్టమునకు విరుద్ధమని పేరువెట్టి 'విక్టోరియా టర్మినసు'నకెదురుగా నూరేఁగింపు నాఁపివైచిరి. సభలు జరుపరాదని శాసించిరి. ఆ వార్త విని ప్రజలు- అక్కడనే 'తిష్ఠ'వైచిరి. జోరున వర్షము. సాయంసమయము నాలుగు గంటలు మొదలు మఱునాఁ డెనిమిదిగంటలదాఁక మహాసముద్రము వంటి యా మహాజనము నడివీదిలో నట్లే నిలిచిపోయిరి. ప్రజాభిప్రాయమునకుఁ బ్రతికూలమైన యా శాసనము నక్షరాల భంగమొనర్చితీఱవలె నని మాళవ్యా పట్టుపట్టెను. సర్దార్ పటేలు సరే యనెను. వెంటనే యధికారు లా నాయకులనుమాత్రము వేఱుచేసి జైళ్లకు సాగనంపిరి. అది పెద్ద నేరమిగా నిరూపించి ప్రభుత్వము మాళవ్యాపండితునకు నూఱురూప్యములు జుల్మానా వడ్డించెను. అది చెల్లింపని పక్షమునఁ బక్షమురోజులు శిక్షయని యాంక్ష వెట్టిరి. చెల్లింపనని మాళవ్యా మొఱాయించి జైలునకే సిద్ధమాయె. ఇంతలో నెవ్వరో గాని యాతనికిఁ దెలియనీయక యా డబ్బు కట్టివైచిరి. ఇష్టము లేకున్నను మాళవ్యా తప్పని

సరిగా విడుదలయై వెంటనే దేశములోఁ బడి నేల నాలుగు చెఱఁగుల సంచారము కావించి విదేశవస్తుబహిష్కరణము గూర్చి పెద్ద ప్రచారము చేసెను.

ఆ యేఁడే-అగస్టు 27-వ తేదిని- అఖిలభారత జాతీయ మహాసభ ఢిల్లీలో జరిగెను. దానికోసమని పైనముగట్టిన మహారథులను దారిలోనే ప్రభుత్వము పట్టివైచి జైలులో నెట్టిరి. ఆ ఘట్టములో మాళవ్యాపండితునకు రాజద్రోహి యని పేరువెట్టి యాఱుమాసములు జైలుశిక్ష విధించిరి.

దేశమునుగూర్చి తెలిసినదిమొదలు-ఎడతెఱపి లేక మదనమోహనుఁ డొకే యూపున దేశసేవలో మునిఁగి పోవుటఁజేసి యారోగ్యము తగ్గిపోయెను. ఎనిమిదేండ్లుగా నొంటికి స్వాస్థ్యము లేక యొంటరిబ్రదుకుగా నింటిలోఁ బడకవేసెను. కాయకల్పచికిత్సను గావించుకొని దేహమున కొకింత హాయి కూర్చుకొనెను. కాని, యానాఁటి దేశపరిస్థితులలోఁ బుట్టిన గగ్గోలువలన నాతని హృదయ ముల్లోల కల్లోల మాయెను. 'క్విట్టిండియా' తీర్మానపురోజులలో విదేశ్య ప్రభుత్వము పంపిన రాయబారము నాతఁడు ధిక్కరించెను. ఆ రాయబారము మాటలకు విలువ కట్టవలదనియు రిక్తహస్తములు శూన్యహృదయములు చూపుటకే వారంతటి దూరాననుండి వచ్చిరనియు మాళవ్యా ప్రజల కుద్ఘోషించెను.

నౌఖాళీపరగణాలో మతవిషయకద్వేషములు ప్రకోపించినపుడు మాళవ్యా పడిన బాధ యింతయంత కాదు.

ఈ చెలరేఁగిన యుద్వేగము మన యజ్ఞానమునకుఁ దార్కాణ మనియు నీ ఘట్టమును సాకుగఁ బెట్టుకొని బ్రిటీషుప్రభుత్వము మఱికొన్నేండ్లీ దేశములోఁ బీఠము పెట్టి పెత్తనము చెలాయించు ననియు నీ కీలకము గుర్తించిరైన నుభయులు మతోన్మాదము విడనాడవలె ననియు వ్యాధితో బాధ పడుచునే ప్రజలకు బోధించెను. హృదయవిదారకములైన నౌఖాలీ దురంతములను గూర్చిన యుదంతములను వినుచు నచ్చటి హైందవుల దుఃస్థితికి మిక్కిలిగా వగచుచు యావద్భారతమును దుఃఖసాగరములో ముంచి మదన మోహానుఁ డస్తమించెను.

భారతజనని గన్న బంగారుబిడ్డలలో మాళవ్యా పండితుఁ డొక యాణిముత్యము. హైందవసంఘములో నాతఁడు మహోదారములైన యభిప్రాయములను వెలిఁ బుచ్చిన మహాపండితుఁడు. సంఘమునకు వెలుఁగులు చూపి తీరుతెన్నులు దిద్ది చక్కఁగా నడపింపనేర్చిన సంస్కర్త. ఆతఁ డొక విద్యామూర్తి. కాశీవిశ్వవిద్యాలయ మాతని సృష్టి. ఆతఁడే యొక మహాసంస్థ. భారతజననీసంగ్రహ స్వరూపమే మదనమోహనమాళవ్యాపండితుఁడు. ఆమె జయాపజయములు — సుఖదుఃఖములు — ఆశానిరాశలన్నియు మాళవ్యాకే పట్టును. కాంగ్రెసు–అధ్యక్షపీఠమున కొకటి రెండుసారు లెన్నుకొనఁబడి వన్నెకెక్కిన దేశోద్ధారకుఁ డాతఁడు.

అతఁడు — ఉపన్యాసవేదిక యెక్కెనా రెండుగంట లకుఁ దక్కువ పుచ్చుకొనఁడు. నిరంతరోత్సాహముతో

నెడ తెగని కార్యదీక్షతో నిచ్చలు జాతీయసంస్థకుఁ బరిచర్యలు చేసెను. ఒకనాఁ డాతఁ డొక చిన్న ప్రచారకుఁడు. మఱొకనాఁ డొక మహానాయకుఁడు. వేఱొకప్పుడు తానే కాంగ్రెసు. ఒకవంక బ్రిటీషువారి జైలుగోడలలో సాత్త్విక నిరోధక భటుఁడు. వేఱొకవంక దేశములో సరియైన సత్యాగ్రహి. ఇదియే యాతని వాలకము. మితవాదులలోఁ బొడసూపిన మాళవ్యా - అతివాదులలోఁ బెత్తనము చేసెను. సామ్రాజ్యమున కాప్తుఁడైన యీ పండితుఁడు దాని నిరంకుశత్వమును హతమార్చుటకయి యష్టకష్టములు పడెను. పూర్వాచారపరాయణుఁడుగా భాసించిన మదనమోహనుఁడు దొడ్డసంస్కర్తగాఁ బరిఢవించి దేశమున కెనలేని మేలు చేసెను. ఆతని నోట వచ్చునవి కేవలము కాలక్షేపము మాటలు కావు. ఆతఁ డొక సుభాషితరత్న భాండాగారము. అమృతము లొలికించు నా సుభాషితము లనేకములు - అర్ధశతాబ్ది నడచిన కాంగ్రెసు చరిత్రలోఁ బర్యాప్తములై ముచ్చట కూర్చుచుండును.

పవిత్రమైన విద్యారంగములో - అసిధారావ్రతము వంటి దేశసేవాఘట్టములో - ప్రజ్ఞానికషాయమాణమైన శాసనసభావ్యవహారములలో - స్ఫటికముఁ బోలిన సత్ప్రవర్తనలో యావద్భారతమునకుఁ దలమానికమైన మదనమోహనమాళవ్యాపండితుఁ డెల్లవారికిఁ బూజనీయుఁడైన దివ్యమూర్తి యనుటలో నబ్బుర మేమున్నది ?

# శ్రీ బాలగంగాధర తిలకు

కాలచక్ర మనంతము. అందుఁ బుట్టిన సర్వజీవులలో మానవ జాతి ముఖ్యము. అందును గొందఱే భౌతికముగా గిట్టియు లోకములో శాశ్వతముగా నుందురు. వారి మనుగడవలన లోకమున కెంతో మేలు కలుగును. అంధప్రాయముగ నున్నజాతి కట్టి యుగపురుషులే వెలుఁగుబాటలు సూపెదరు. గుమగుమ గుబాళించు సువాసనలు పరిసరముల కిచ్చుచుఁ దాను సమసిపోవు కప్పురమువోలెఁ దా మష్ట కష్టము లనుభవించియుఁ గృశించియు జాతికి వికాసము కూర్చెదరు. అట్టి దివ్యమూర్తులలో 'లోకమాన్య' బాలగంగాధరుఁ డొకఁడు.

మహారాష్ట్రములో రామచంద్ర గంగాధరుఁడను బేద బ్రాహ్మణుఁ డుండెను. పవిత్రతలోఁ బ్రఖ్యాతిలో – ఆ వంశమువా రాదేశములో మిక్కిలి ముఖ్యులు. నాఁటికే యావద్భారతములో నాంగ్లభాష యడుగువెట్టి యార్థికముగాఁ బెక్కుమంది నాకర్షింపఁజొచ్చినది. రామచంద్రుఁడు నిఱుపేద యగుటచే – ఆ చదువులజోలికిఁ బోలేదు. సంప్రదాయమునుబట్టి సంస్కృతభాషను నేర్చుకొనెను. అభిమాన

శాస్త్రముగా గణితమును గణించి యందు సంపూర్ణ పాండిత్యము సంపాదించెను. ఆ శాస్త్రములో నద్భుతములైన గ్రంథములను వ్రాసి మహాపండితుఁడనియుఁ బేరు వొందెను. ఈతని పిన్నతనమందే తండ్రి గతించెను. వెనుక ముందర నాదరించువా రెవ్వరు లేమిని రామచంద్రుఁడే సంసారము నీఁదవలసివచ్చెను. భార్యపేరు పార్వతీబాయి. ఆలుమగలకా సంసార ములవికానిదయ్యెను. నెల కయిదురూప్యముల వేతనములో రామచంద్రుఁ డధ్యాపకుఁడుగాఁ జేరెను. క్రమక్రమముగ నా పదవిలో వికాసము పొందుచు 'డిప్యూటీ ఇన్‌స్పెక్టరు'గాఁ గొలువులోఁ గుదిరిపోయెను. ఆ పదవిని బట్టియు నాతఁడు వ్రాసిన గణితశాస్త్రమునుబట్టియు నాతని పేరు నలుమూలల కెగఁబ్రాఁకెను.

ఆ దంపతులకు నలువురు సంతానము. అందొక్కఁడే మగబిడ్డ. అతఁడే బాలగంగాధరతిలకు. అతఁడు రత్నగిరిలో 1856–జులై 23 వ తేదిని జన్మించెను. తండ్రి పెట్టుకొన్న పేరు కేశవుఁడు. లోకవ్యవహారములో 'బలవంతరావు తిలకు.' బాల్–అన్నది సాంకేతికనామము. అదియే కాలక్రమమున బాలగంగాధరతిలకుగాఁ బరిణమించెను.

పువ్వు పుట్టఁగానే సువాసన పొడము నట్టులు బాలగంగాధరుఁడు మేధావి యని బాల్యమందే పేరు పొందెను. బుద్ధిపాటవమునుబట్టి యాతఁ డందఱకుఁ బ్రేమపాత్రుఁ డయ్యె. కాని కొంచెము గడుసరి. ఒకనివలన మాటపడు తత్వము వానిది కాదు. నిష్కారణముగా నెవ్వరే నేమేని కఱకుగాఁ బలికిరా యది నిరాకరించి మొత్తాయించి నిలుచును

వరుసకు నుపాధ్యాయులే పొరపాటుగా నొక మాట యన్నపుడు తిలకు దానిని సహింపఁడు. బడికే 'యెసరువెట్టి' యింకఁ బోవనని భీష్మించును.

ఐదవయేఁట నక్షరాభ్యాసము చేయించి మంచిగురువులవద్ద నాతనిని జదువవేసిరి. తండ్రియు సమర్థుఁడైన యుపాధ్యాయుఁ డగుటచే నింటను బయటను జదువులలో బాలగంగాధరుఁ డెదుగుచుండెను. ఆతనికి బాల్యములోనే తండ్రి కొన్ని శ్లోకములు వినిపించెను. అందు నిర్బంధము లేదు. వినోదముగా నుత్సాహముగా వినును. విన్నవి చక్కఁగా వల్లించును. శ్లోకమున కొక్క కాని యిత్తునని తండ్రి రివాజు పెట్టెను. తండ్రి పెట్టిన యా పందెములోఁ దనయుఁ డందె వేసినచేయి యాయెను. ఆ ధోరణిలో నాతనికి రోజున కెన్నో శ్లోకములు కంఠస్థములయ్యెడివి. ఒకనాఁ డాతఁ డాలెక్కలో శ్లోకము లప్పగించి రెండురూపాయలు గడించెను. అసాధారణ మేధావి కాక - ఏకసంథాగ్రాహి కాక మఱెవ్వఁడేని యా వయస్సులో రోజునకు నూటయిరువదియెనిమిది శ్లోకములు 'ధారణ' చేయఁగలఁడా?

ఎనిమిదవయేఁట నుపనయనము చేసిరి. అప్పటికే యాతని చదువులో 'సాధారణగణితరూపావళి' ముగిసినది. సమాసచక్రము సొంతమైనది. అమరకోశములో సాఁబాలు నెమరునకు వచ్చినది. ఆవల రెండేండ్ల కుద్యోగవశమునఁ జేసి యాతని తండ్రి పూనాపట్టణమునకుఁ బోయెను. తండ్రితోఁ గలిసియున్న యా బిడ్డకు - పూనాలో విద్యావ్యాసంగము పుష్టిగా జరిగెను. ఇంటిలో బడిలో నాతని చదువు ద్విగుణీ

కృతమై యొంటఁబట్టెను. కాని యా ధోరణి చిరకాలము సాగదాయె. ఆతని పదునాఱవయేటఁ దండ్రి దివంగతుఁ డయ్యె. అప్పటి కాతఁడు – అంకగణితము బీజగణితము రేఖాగణితము మున్నగువానిలో మంచిపాటవము గడించెను. సంస్కృతభాషలోని సామాన్యశ్లోకము లన్నిటికిఁ జక్కఁగా వ్యాఖ్యానము సేయును. అంతకు ముందే తల్లియు గతించుటచేఁ బినతల్లిచేతిలోఁ బెరిఁగి పెద్దవాఁడాయెను. పినతల్లికిఁ బినతండ్రికి బాలగంగాధరుఁ డన్న నమితమైన ప్రేమ; అత్యంతమైన గారాబము.

ఆ దశలో బాలగంగాధరుఁడు 'పూనా సిటీస్కూలులోఁ' బ్రవేశించెను. స్వతంత్రతాబుద్ధి యన్నది యాతని కుగ్గుఁబాలతో వచ్చిన దొడ్డగొనము. అది యప్పుడప్పుడు లాఁతివారి కొకింత వెగటుగాఁ దోఁపవచ్చును. కాని, వాని తత్త్వము వానిదే. తనకు సరియని తోఁచినదానిలో గురువులు సెప్పినను ససేమిరా యనును. చెప్పినపాఠము లొప్పిదముగ వినును. చదువవలసినవి చక్కఁగాఁ జదువును. అక్రమమని తోఁచెనా యొమ్ము విఱిచి నిలుచును. చీటికి మాటికి గురువులతోఁ గొండాటము సేయును. ఒకతూరి క్లాసులో – ఉక్తలేఖనము సెప్పిరి. అందు 'సంత' యను శబ్దము మూఁడుపర్యాయములు వచ్చెను. మూఁడుచోట్లను మూఁడువిధములుగా 'संत - सन्त - सन्नत' అను రూపములు గంగాధరుఁడు వ్రాసెను. వానిలో మొదటిరూప ముంచి తక్కినవి రెండును దప్పులని గురువులు దిద్దిరి. కాదని తిలకు నిలిచి పలికెను. గురువులు తీండ్రించి హెచ్చరించిరి. వాదము

జరిగి వివాదములో దిగెను. శిష్యుఁడు తగ్గఁడాయె. అదియొక 'కేసుగాఁ' బరిణమించి పెద్దయయ్యవారి సన్నిధికి నడచినది. వా రెంతో యుక్తి చెప్పిరి. ఎన్ని చెప్పినను-ఆ రెండు రూపములు సాధువులే యని గంగాధరుని వాదము. తుద కా వాదములో - ప్రధానోపాధ్యాయులే గద్దె దిగి శిష్యుని సమర్థించుదాఁక నాతఁ డొప్పుకొనఁడాయెను. మఱొకతూరి చదువులలోనే సంస్కృతోపాధ్యాయులతో నాతఁడు జగడము వేసికొనెను. అదియుఁ జాల ముదిరి 'రగడ'లో దిగెను. ఆ ఘట్టములో - ప్రధానోపాధ్యాయు లా యుపాధ్యాయునే సమర్థించిరి. నాఁటితో గంగాధరుఁ డా పాఠశాలకు స్వస్తి చెప్పెను. ప్రధానోపాధ్యాయు లా పాఠశాలలో నున్నంత దాఁక నాతఁ డా పాఠశాలలో నడుగు వెట్టనే లేదు.

1871-వ యేఁట నాతనికి వివాహ మాయెను. భార్య పేరు సత్యభామాబాయి. లోకములో వివాహము విద్యానాశమునకు మూలకంద మనుట ముప్పాతికమువ్వీసము సత్యమే కావచ్చును. కాని బాలగంగాధరుఁ డా సూత్రమునకుఁ బాత్రము గాక యా మఱుసటి యేఁటనే ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణుఁడయి దక్కనుకాలేజిలోఁ జేరెను.

చదువవలసినవేళలోఁ దన్మయుఁడై చదువులలో మునిఁగిపోవును. అప్పుడు ప్రక్కగా బాజాలు పెద్దపెట్టున మ్రోయించినను వాని యవధానము చెక్కుచెదరదు. ఆ చదివిన నాలుగు ముక్కలు - ఒంటిలో నంటి మాయని మచ్చగా- అచ్చు గ్రుద్దినట్టు లదుకవలసినదే. నడుమ నడుమ చెలికాండ్రతోఁ గలసిమెలసి ఛలోక్తులు విసురుచు హాయిగాఁ

గాలము గడపును. అనారోగ్యము మూలమున విద్యా వ్యాసంగములో నంతరాయములు దాపరించినను బట్టిన పట్టు విడువక బి. యే. పరీక్షలో - ప్రథమశ్రేణిలో ఫలిత మందెను. చిన్ననాఁడే బాలగంగాధరుఁడు సంస్కృతములోఁ జక్కఁగాఁ గవిత్వము చెప్పనేర్చెను. ఆవల, యల్. యల్. బి పరీక్షలోసైత ముత్తీర్ణుఁడయ్యెను. ఈ పరీక్షలు - ఈ పట్ట ములు కేవలము ధనార్జనముకోసమే యన్న భావము బాలగంగాధరున కే కోశములోను లేదు. సర్కారుకొలువులో నడుగువెట్టుట యాతని ప్రకృతి కే విరుద్ధమైన ప్రవృత్తి. ఆతని మిత్రు లెంద ఱందఱో న్యాయవాదులుగాఁ జేరిరి. ఆ రోజు లలో న్యాయవాదికి గుప్పిళ్ళకొలఁది సొమ్ము కూడఁబెట్ట వలయునన్న నెన్నో సౌకర్యము లుండెడివి. అయినను - ఆ ధోరణి బాలగంగాధరునకు నచ్చలేదు. పైగా - నితరవృత్తుల జోలికిఁ బోవక యుపాధ్యాయవృత్తినే కైకొందునని వ్రతము పట్టెను.

1880 జనవరి యొకటవ తేదిని మఱొక మిత్రుని దోడు చేసికొని బాలగంగాధరుఁ డొక పాఠశాలను స్థాపించెను. పదునెనిమిదిమందితోఁ బ్రారంభమైన యా విద్యాసంస్థ నూటయేఁబదిమంది విద్యార్థులతో నేపుగాఁ బెరిఁగిపోయెను. నవ్విననాఁపచేనే పండినట్టు లాదిలో నందఱు నవ్వుకొన్న యా పాఠశాల కళాశాలయై పూనాపట్టణములోఁ బెద్దపేరు గడించెను. ఆవల నాలుగేండ్లకే వేయిమందికిఁ బైగా విద్యా ర్థులు వచ్చి చేరిరి. ఆ సంస్థలోని సాధకబాధకము లన్నియు బాలగంగాధరుఁడే వహింపవలసివచ్చెను. మొదట నొంటివాఁ

డయ్యు నాతఁడా భారము నిర్వహించుటలో వెనుకంజ వేయక మంచి సంప్రదాయములు పెంచి యా సంస్థను వృద్ధికిఁ దెచ్చెను. సామాన్యముగాఁ బ్రారంభింపఁబడిన యా పాఠశాలయే తుదకు 'ఫర్గూసన్ కాలేజి' గాఁ బరిణమించెను. ఈ కళాశాల కనేకు లనేకవిధములుగా సాయపడిరి. మహామేధావి యగు తిలకుపండితుఁ డీ సంస్థలో గణితశాస్త్రమునే గాక సైర్వాణినిగూడ బోధించెను. ఆతని బోధనాపటిమకు ముగ్ధులై యెందఱో కుఱ్ఱకాఱు- ఆ కాలేజిలోఁ జేరి చదువు సంధ్యలు సాగించుటయే గాక యాతఁడన్న నమితభక్తిశ్రద్ధలు చూపనేర్చిరి.

1881 లో బాలగంగాధరపండితుఁడు 'కేసరి - మహారాష్ట్ర' యను రెండుపత్రికలు ప్రకటింపవలెనని నిశ్చయించెను. మొదటిది యాంగ్లేయభాషలోను రెండవది ప్రాంతీయ భాషలోను సాగింపవలెనని సంకల్పము. ముద్రాయంత్రములు విరివిగా దొరకని యా రోజులలో రెండువేల రూప్యముల కొక యంత్ర మమ్మకమునకు వచ్చెను. ఆతనికిఁగాని యాతని మిత్రులకుఁగాని దానిని విలిచి తెచ్చుకో నోపికయు లేదు. కాని యేదో సమపాయముగ - అంచెలంచెలుగా- ఆ ఋణము తీర్చుధోరణిలో నది కొనివైచిరి.

మున్మొదట, విష్ణుశాస్త్రి - తిలకు - ఆగర్కార్, ఈ మువ్వురు సంపాదకీయములు వ్రాయఁజొచ్చిరి. 'కేసరి' లో సామాజిక ఘట్టములు చక్కఁగా విమర్శింతురు. నైతికముగా విలువ నొసగు వ్యాసము లెన్నో ప్రకటింతురు. రాజకీయములకుఁ గొదువ లేదు. ప్రభుత్వశాసనములలోని మంచిసెబ్బరలు

తేటతెల్లముగఁ బ్రజల కండుపాటులో నుండునట్లు నిర్వ-చింతురు. ఆ రోజులలో - ఆ పత్రికలు నాలుగయిదువేల ప్రతుల కమ్మక మున్నదన్నచో వాని విలువ యూహింపవచ్చును. ఉత్తేజము కూర్చు మంచివ్యాసములకును విషయావగాహమున కుపకరించు సంపాదకీయములకును 'మహారాష్ట్ర-కేసరి' పత్రికలు పెట్టినదిపేరుగాఁ బ్రచారమునకు వచ్చెను.

ఆ పత్రికలకు - అప్పటి రాజకీయపరిస్థితులకు గాఢమైన సంబంధము కలిగెను. బేరసారములవంకతో నీ గడ్డలో దిగిన యాంగ్లేయు లీ దేశము కైవసము చేసికొనుటలో సంస్థానాధిపతులు చాలవఱకు సహాయకారులైరి. ఆత్మగౌరవము కలిగి పౌరుషము సూపనేర్చిన రాజాధిరాజుల నేదో నెపము పెట్టి యణఁచిమణచి తమ సామ్రాజ్యము నిచ్చట నాంగ్లేయులు స్థాపించుకొనిరి. అప్పుడు బరోడాసంస్థానమునకు మురహరిరావు గైక్వాడ్ ప్రభువై పరిపాలించుచుండెను. ఆతని పాలకము సరిపడక యాంగ్లేయు లాతనిని గద్దెనుండి దించిరి. దత్తపుత్రుఁడగు సాయజీరావు - ఆ రాజ్యమునకు వచ్చెను. ఆతఁడు పేరునకుమాత్రమే ప్రభువు. అధికారము లేవియు నాతనికి లేవు. అధికారులుమాత్ర మాతని నెత్తిని గూరుచుందురు. ఉత్సవవిగ్రహముగా నాతనిని మన్నించి మంత్రియే సర్వకార్యభారము నిర్వహించుచుండఁగాఁ బైయెత్తున విదేశీయులు పెత్తనము చేసెదరు. ప్రజలతో - ఆ ప్రభువునకు సంబంధ మేమియు లేదు. పైగా- ఆ దేశమునకుఁ గ్రొత్తవాఁడైన యొకానొకని మంత్రిగాఁ దెచ్చి పెట్టిరి.

ఆతని పేరు మాధవరావు. ఆతఁడు కొన్నేండ్లు తిరువాన్కూ-రులో దివాన్‌గిరీ చేసి పేరు గడించెను. ఇప్పుడు బరోడాకాతఁడు సరిక్రొత్తమంత్రి యాయెను. ప్రజాభిప్రాయము పాటింపవలెనన్న - ఆ యుద్యోగ మూడిపోవు దశలో నుండెను. ఉద్యోగము మానుకొనుటకా మన సొప్పని మానిసి యాతఁడు. కాఁగా నాతఁ డచ్చముగా నాంగ్లప్రభుత్వమునకు 'ఏజెంటు'గా మాఱిపోయెను.

బరోడాపరిపాలనముగూర్చి దేశములో గుసగుసలు బయలుదేరెను. ఆ యేలుబడిలోఁ బ్రజల యిక్కట్టు లాలకించు నాథుఁడే లేఁడు. ఎవ్వరి 'క్షోభ' వారిదే. ఆంగ్లేయులగు సిపాయులను దెచ్చి సంస్థానములో నింపివేసిరి. రాజ్యవ్యవస్థ సర్వము తాఱుమాఱాయె. ప్రజల భంగపాటు చెప్పఁదరము గాదు. మంత్రి, యేది చేసినను విదేశప్రభుత్వము మన్నించును. ఆతనికిఁ గావలసినదియు సర్కారువారి సంపూర్ణకటాక్షవీక్షణము. ఈదుస్థితికి దేశములో వగవని మానిసి లేఁడు. కాని నోరు విప్పి వీధిలో వేయఁగల వ్యక్తియుఁ గానరాఁడు.

ఈ దశలో కేసరిపత్రిక జోక్యము తీసికొనెను. బరోడా పరిపాలనముగూర్చి పూసగ్రుచ్చినట్టు లా పత్రిక ప్రకటించును. ఆ మంత్రి కావించు దుశ్చేష్టలు మొగమోడక వీధిని బెట్టును. నానాఁటికి సంస్థానములోని పరిస్థితులు విషమదశకు వచ్చెను.

మహారాజునకు మతి పోయెనని దేశములోఁ జెప్పుకొనిరి. రాజ్యభారము సర్వము మాధవరావుమంత్రిదే.

ఆతఁడు నందియన్న నంది; పందియన్నఁ బంది. ఆతని మూలము ననే ప్రభువున కున్మాదము సంభవించెనని ప్రజలలో ననుమానము రేకెత్తెను. ఆరుగాలము చెమట యోడ్చి నెత్తురు పిండి ప్రజలు పండించిన పంట లూఁచముట్టుగ సంస్థానము దోఁచుకొనును. ఆయవ్యయములు సరిపెట్టరు. అలవి మాలిన కర్చులు. మితిమీఱిన వైభవములు. దివాణ మంతయుఁ గ్రమముగా నిర్ద్రాణదశకు దిగజాఱెను. దేశీయుల గొంతులు కోసి విదేశీయుల వేడుకలు జరిపెదరు. రాజుల సొమ్ము రాళ్ళపాలాయె నన్నట్టు లా సంస్థానములోని సొమ్ము విదేశము నకు రేయుంబవలు గవ్వలుగా గచ్చలుగా నడచిపోవును. మహారాజును జికిత్సకోసమై విదేశములకుఁ బంపవలెనని యాంగ్లపత్రిక లనేకము లుపదేశింపసాగెను. ఆ యుపదేశము చెవిని బడి మహారాజును వెంటనే యిటలీకిఁ బ్రయాణము చేయించిరి. పాప మాతఁడు దారిలోనే మృత్యువువాతఁ జొచ్చెనని దుర్వార్త వినవలసివచ్చెను.

ఇట్టి దురంతము లన్నియు నొక్కుమ్మడి దేశములోఁ జుట్టుకొనెను. మంత్రిచేష్టలు ప్రజలకు దుస్సహములయ్యె. మహారాజుమరణమునకు మంత్రియే కారణమని పత్రికలు వేనోళ్ల ఘోషించెను. ఏలుబడిలోని దోసఁగులను గూర్చి కేసరిపత్రిక దుమారము రేఁపెను. ఈ తాకిడికి మంత్రి వర్యుఁడు – ఉక్కిరిబిక్కిరియై కాలు కాలిన పిల్లివోలెఁ జీకాకుపడెను. ఇట్టి వ్రాఁతలు వ్రాసెదరా యని బిట్టుగ నాతఁడు తామసము తెచ్చుకొని పత్రికలపై 'దావాలు' వేయు ప్రయత్నములో దిగెను. ఈ యార్భాటమునకు

జంకి పెక్కు పత్రికలవారు క్షమార్పణము లిచ్చి యా
బెడదనుండి వైదొలఁగిపోయిరి.

కేసరిపత్రికమాత్రము వీరకేసరియై రంగములో
నిలిచెను. అందలి ప్రత్యక్షరమునకు బాలగంగాధరుఁడే
బాధ్యత వహించెను. ఆ వ్రాఁతలవలనఁ దన కెంతో మాన
నష్ట మాయెనని మాధవరావుమంత్రి దావాలో దిగెను.
అప్పుడు దేశములోఁ బేరుమోసిన న్యాయవాదులలో
'ఫిరోజిషా మెహతా' యొకఁడు. ఆతఁడు నడుము గట్టుకొని
తిలకు పక్షమున నిలిచి హోరాహోరిగఁ బోరాడెను.
'కేసరి'వార్తలలో దోసములే లేవని తెన్నుగా నిరూపించెను.
ఆ వార్తలు ప్రధానముగాఁ బ్రజాభిప్రాయమునుబట్టియే
ప్రకటించిరని వాదించెను. కాని యా 'కేసు' తీవ్రధోరణికిఁ
బోయెను. బాలగంగాధరునకుఁ గారాగారశిక్ష విధించిరి.
ఎందఱెందఱో ప్రజ లాతని విడిపింపవలెనని వేఁడుకొనిరి.
దొరతనము వారి మొఱలను బెడచెవిని బెట్టెను.

ఆ శిక్ష యనుభవించినపిదప - ఆతఁ డచ్చముగా
రాజకీయములలోఁ జొచ్చెను. అదియే యాతని జీవితములో
నూతనాధ్యాయమునకు నాంది. సాంఘికముగా నాతని
-కున్న సిద్ధాంతములు మహోన్నతస్థాయికిఁ జెందును.
అంధానుకరణమన్నది యాతనికి బొత్తిగా గిట్టదు. విదేశ్యు
లెవ్వరో యీ గడ్డలోఁ బరిపాలించుట యాతనికి వట్టి
రోఁతగాఁ దోఁచును. సామాజికవ్యవస్థను జక్కఁదిద్దవలెనని
యాతని పట్టుదల. కాని, రాజకీయముగా దేశమునకు బలుపు
పొలుపులు చిక్కినఁగాని సామాజికముగ సర్వవ్యవస్థలు

సనిగా నుండవని గంగాధరుని నిశ్చయము. దేశము దాస్యములోఁ బడి చివికి చెన్నటి యున్ననాఁడు సాంఘిక వ్యవస్థకు స్వాస్థ్యము దక్కదని దాని భావము. కావున మున్ముందుఁ బరిపాలనములోఁ బరదేశీయుల పెత్తన మంతరింపవలె నని యాతఁడు ప్రయత్నించెను. 'మంద కొడి'గాఁ బడియున్న జాతిని మేలుకొలుపవలెనన్నఁ జరిత్ర చక్కఁగా నేర్పవలెను. చరిత్ర లేని జాతి వట్టి నీరసమైన జాతి యగును. ఉన్నదానిని విన్నదానిని గుఱుతించుటలోనే వివేక మున్నది. సంఘములోఁ బాదుకొన్న దురాచారములను మునిముందు దూరీకరింపవలెను. ఇంట గెలిచి రచ్చ గెలుచుటలోనే విలువ నిలిచియుండును. ఈ భావములతో బాలగంగాధరుఁడు సాంఘికముగా గొప్ప సంస్కరణకు దిగెను.

బాల్యవివాహముల కాతఁడు బద్ధవిరోధి. ఉపదేశ పాండిత్యమే గాదు; ఆతఁడు తన కూఁతులకు యుక్త వయస్సు వచ్చునందాఁకఁ బెండ్లిపేరంటములు చేయలేదు. అందాఁక వాండ్రను జక్కఁగాఁ జదివించెను. ఆ రోజులలో నయ్యది యొక దొడ్డ సంస్కరణ. సర్వశాస్త్రములు క్షుణ్ణముగాఁ జదివిన మహాపండితుఁడు కావున – ఆచారములో వచ్చిన నడుమంతరపు విధినిషేధముల నాతఁడు లెక్క సేయఁడు. సముద్రయానము దోషమని నాఁటివారిలోఁ బెద్ద నమ్మకము. అది వమ్ముసేయవలె నని బాలగంగాధరుఁడు పట్టుపట్టి పెద్ద వయస్సులోసైతము సముద్రయానము చేసి సంస్కర్తల కెల్లరకుఁ దలమానికమై నిలిచెను.

బరోడాలో - అప్పుడు హిందూమహమ్మదీయులలోఁ జిటికిమాటికిఁ గల్లోలములు రేఁగుచుండెను. దానికి గంగాధరుఁ డెంతో యాందోళన మందును. ఉభయజాతులలోఁ బుట్టిన యీ 'రాచపుండునకుఁ' గారణము విదేశప్రభుత్వమే యని గంగాధరుని వాదము. తెఱవెనుక నిలిచి భాగవత మాడించుటలో విదేశ్యులది యందెవేసిన చేయి యని యాతఁడు 'కేసరిలో' సంపాదకీయములు వ్రాసెను. సన్నగా జాలువాఱిన యీ వివాదకాండ మాదిలోఁ ద్రుంచివైచినచో నావల నేఱుగాఁ బ్రవహింపను వీలు లేదని గంగాధరుఁడు బోధించెను. వాదము పొడమినప్పుడు పాక్షిక బుద్ధి పనికిరాదని యాతఁడు ప్రభుత్వమును మూదలించెను.

ఒకతూరి 'మధ్యప్రాంతము' వారు శాసనసభకు గంగాధరు నెన్నుకొనిరి. ఆతఁడు సభ్యుఁడుగా నున్నంతకాలము రేయుంబవ లోపిక చూపి యెన్నో మంచిపనులు చేసెను. ప్రభుత్వమువారు కావించు ప్రతికార్యమును సహస్రాక్షుఁడై సరిచూచును. గుణ మున్నచోఁ గొండాడును. దోస మున్నదా లేశమేని జంకక కుండ బ్రద్దలుగొట్టినట్టులు వీధిని బెట్టవలసినదే. శాసనసభలలో సర్వతోముఖప్రజ్ఞను జూపి దేశీయుల మంచిసెబ్బరలు లెస్సగా నారసి నిర్భయముగా వాదించు బాలగంగాధరుని వాదనాధోరణి కబ్బుర మందని సభ్యులే లేరు.

దేశీయమహాసభలోసైత మాతనికి మంచి చోటువ కలదు. బొంబాయిప్రాంతములోని కాంగ్రెసుసంఘమున కాతఁడై దేండ్లు వ్యవహర్తగా వ్యవహరించెను. అప్పుడా

రాష్ట్రములో - కాంగ్రెసుపక్ష మత్యద్భుతముగా వృద్ధి
పెందెను. 1895 లో జరిగిన భారతజాతీయమహాసభాసమా
వేశమున నాతని నాహ్వానసంఘాధ్యక్షునిగా నెన్నుకొనిరి.
సామాజిక విషయములు 'కాంగ్రెసు' వేదికపయిఁ జర్చింప
వచ్చునా లేదా యన్న వివాద మా మహాసభలోఁ బొడమి
దుమారము రేఁగెను. మహోన్నతరంగముగా భావించు
నీ వేదికమీఁద - అంతరంగికములైన సాంఘికఘట్టములు
చర్చింపరాదని తిలక్ పండితుని పట్టుదల. కాని యా సభలో-
ఆ వాదము నెగ్గదాయె. వెంటనే యాతఁడు తన పదవికి
'స్వస్తి' చెప్పి వెలుపలికి వచ్చెను. కాని యాతని
హృదయము మాత్రము దేశీయమహాసభాపక్షమందే నిలిచి
పోయెను. వెలుపలికి వచ్చెనన్న పేరేకాని కాంగ్రెసున
కాతఁడు చేసిన సేవ చెప్పఁదరము గాదు.

యావద్భారతజాతికి నైక్యము నేర్పి సాముదాయిక
ముగా సమధికోత్సాహము కూర్పవలెనని గంగాధరుఁడు
భావించెను. దాని కొక కార్యక్రమ మేర్పఱిచెను. అప్ప
టికే దేశములో గణపతినవరాత్రములని యుత్సవములు -
ఇంటింటను జరుగుచుండెడివి. అట్టివి మఱికొన్ని సాముదా
యికములుగా నిర్ణయించి జాతీయోత్సవములుగా నుద్ధరించి
నచో దేశభక్తి కుదురవచ్చును. తన్మూలమున జాతీయ
భావము పొడమి ప్రజలలో నొకానొక చైతన్యము పుట్ట
వచ్చును. ఈ సంకల్పముతో నాతఁడు 'జాతీయపర్వము'
లని పేరువెట్టి గణపతి యుత్సవమునే గాక శివాజీజయంతిని
సైతము ప్రారంభించెను.

ఆ దేశములో శివాజీనిగూర్చి యందాఁక నెవ్వరి కంతగాఁ దెలియదాయె. రాయగడముదుర్గములో 1818 వఱకు పీష్వాల సిపాయు లుండెడివారు. ఆవల నా ప్రాంత మంతయు బగ్గముపాడై పోయెను. విచ్చలవిడిగా గడ్డి పెరిఁగి చెట్టుచేమ లేకమై ముండ్లతోఁ బొదలతో బీభత్సమై చీమ దూఱని చిట్టడవిగాఁ గాకి దూఱని కాఱడవిగా మాఱి పోయెను. చరిత్రలో సన్నుతి కెక్కిన యా ప్రాంత మంతయు నప్పుడు చూచిన గుండెలు తఱుగుకొనిపోవు దుర్దశ దాపరించెను. ఆ పాడువడ్డ కోటను సంస్కరించు నాథుఁడే లేఁడు. విదేశీయుఁ డొకఁడు పాప మీ ఘట్టములో నభిమానము పుట్టుకొనివచ్చి యా ప్రాంతము నుద్ధరింపుఁడని యధికారులను గోరెను. మహారాష్ట్రములో నేఁడు వీరులే లేరా యని వీరావేశమెత్తి యెత్తిపొడుపులతో నెన్నో వ్యాసము లతఁడు వ్రాసెను; ఉపన్యాసము లిచ్చెను. అవి యన్నియు నా దేశీయుల చెవులలో గింగురుమని మ్రోగెను. అవియే యా జాతికి మేలుకొలుపు లాయెను. ఆపై- కేసరిలో- తిలక్ పండితుఁ డా ఘట్టము నెత్తుకొనెను. బ్రదికిన రాయగడము మహోన్నతస్థితి, చక్కఁగా వర్ణించెను. ఈ నాఁటి దుర్దశ యిట్టిదని వ్రేలుపెట్టి చూపెట్టెను. జాతి నిర్వీర్యమై పోయె. ఆ పౌరుష మేమైపోయెనో? శివాజీ ప్రతిభను గుఱుతించు వివేకమే లేకపోయెను. తన దేశమునకుఁ బ్రాణము వోసిన - తన జాతి నుద్ధరించిన మహానాయకుని సంస్మరింపని జాతి వట్టి దుర్జాతి. కృతజ్ఞతాగంధమే యెఱుఁగని జాతికిఁ బుట్టగతులు లేవు. ఇత్యాదిగా బాలగంగాధ

రుఁడు వేనోళ్ల బ్రోళ్ల రోఁకళ్లఁ బాట పాడెను. ఆతని ప్రాఁతలు మంత్రము పెట్టినట్టులు ప్రజలలోఁ బనిచేసెను.

అదియే జాతీయభావమున కంకురార్పణ మాయెను. జాతీయనాయకునిగా శివాజీని సంస్మరించి నాఁటి మధుర స్మృతులను హృదయమునకుఁ దెచ్చుకొన్న యాబాల గోపాలమున కావేశము వచ్చిపడెను. శివాజీస్మారకనిధి సిద్ధమాయెను. విరాళములు ప్రోవుచేసిరి. సమావేశములు సమకూర్చిరి. ఉపన్యాసము లిచ్చిరి. ఉపదేశము లొసఁగిరి. ప్రజల యుత్సాహమున కంతు లేదు. పెద్దల ప్రోత్సాహమునకు మేర లేదు. రాయగడ ముద్ధరింపవలెనని కొందఱు. శివాజీమంటపమును స్థాపింపవలెనని మఱికొందఱు. విద్యాపీఠము నిర్మింపవలెనని వేఱొక కొందఱు. అప్పుడు బాలగంగాధరుఁడు శివాజీస్మారకసమితిపేరఁ బెద్ద సమావేశమేర్పాటుచేసెను. ఎందఱెందఱో సుప్రసిద్ధులైన మహావక్తలు-ఆ సభావేదికకు వచ్చిరి. సత్యేంద్రనాథబెనర్జీ - ఆ సభ కధ్యక్షుఁ డాయె. మదనమోహనమాళవ్యా - ఆ సభలో మాటలాడెను. వారి మాట లావేశముల మూటలై కర్తవ్యము బోధించెను. మంత్రముగ్ధులైన మూఁడ్కొ సభలోఁ గూరుచున్న సర్వజన మా మహోపన్యాసములు విని వీరావేశ మెక్కి మఱొక యవతారమే దాల్చిరి.

ఆవల శివాజీజీవితఘట్టములనుగూర్చి కేసరిలో వరుసగ వ్యాసములు వచ్చెను. శివాజీవీరుఁడు చేసిన ప్రతికార్యము దేశముకోసమే యన్నవాదము సిద్ధాంతమయ్యె. ఆతని జీవితమే దేశసేవ కంకితమై పోయెనని యందఱు గుర్తించిరి.

ఆ వీరాధివీరుఁడు జాతికి రత్నమువంటివాఁడని నిగ్గుతేల్చిరి. ఆయేఁడు రాయగడలో శివాజీజన్మదినోత్సవమును దలపెట్టిరి. ఆ యుత్సవము చేయరాదని జిల్లాకలెక్టరు- అటకాయించెను. వెంటనే బాలగంగాధరుఁడు గవర్నరువద్దకు వెళ్ళి చెప్పవలసినవి చెప్పి యుత్సవమున కంగీకృతి తెచ్చెను. 1897 జూన్ 13 వ తేదిని - ఆ యుత్సవము ప్రారంభమాయె. జూన్ 13 వ తేదిని శివాజి రాజ్యాధికారమునకు వచ్చెనఁట.

అది మొదలు దేశములో నొక క్రొంగ్రొత్త యుత్సాహము రేకెత్తెను. మహారాష్ట్రుల హృదయములో నవ్యచైతన్య ముద్భవించెను. ఆ మహావీరుని చరిత్ర యాబాలగోపాలము పఠింపసాగెను. నవ్యసాహిత్యములో - అది యొక విశిష్టస్థానము సంపాదించెను. గద్యములుగాఁ బద్యములుగాఁ గవివర్యులు వర్ణించిరి. సంచికలలో వ్యాసము లసంఖ్యాకములుగా వెలువడెను. చరిత్రాత్మికపరిశోధనలు చక్కఁగా సాగెను. జాతీయభావము రంగరించి నూటిపోసిన యీ వాఙ్మయము చూచి ప్రభుత్వము కన్నుగుట్టెను. తిలక్ పండితుఁడు దొరతనముకంటిలో నలుసుగాఁ బరిణమించెను.

శివాజీవీరుని యుత్సవకార్యక్రమమునుగూర్చి కేసరిలోఁ జక్కఁగాఁ బ్రకటించిరి. పాటలుగాఁ బద్యములుగా వ్యాసములుగా మనోహరముగాఁ గానవచ్చు 'కేసరి' వ్రాఁతలు చూచినకొలఁది - దొరతనమువారి యొంటిలో జెట్టులు ప్రాఁకెను. అంతలో నా ప్రాంతములో నిర్వురు తెల్లవాండ్ర నెవ్వరో యేదో కారణమునఁ జంపివైచిరి. అది సాకుగాఁ గైకొని రాజద్రోహ మన్న నేరమి యారోపించి ప్రభుత్వము

తిలక్ పండితుని జైలులో వేసిరి. ఆ కేసులో స్వయముగా నాతఁడు వాదింపను వీలులేదని కోర్టువారు - అంక్షవైచిరి. తిలకుపక్షమున వాదింపను 'ఫ్ర్యా' - 'గార్థ్' - అను నిద్దఱు న్యాయవాదులు సిద్ధమైరి. కేసువిచారణ-అక్కడఁ గాదని కలకత్తాకు మార్చిరి.. తిలకుపక్షమున న్యాయవాదులు చక్కఁగా వాదించిరి. నిజముగా హత్యయే బాలగంగా ధరుఁడు చేసియున్నచో - ఆతనిమీఁద హత్యాదోషమే యారోపింపవలెఁగాని రాజద్రోహ మని పిలువనేల? రాజ ద్రోహమని పేరుపెట్టినపు డీ కేసు చెల్లరాదని వారి వాదన. పైగా - ఆ చంపెనన్న కేసు విచారింపవలసినది పూనా కోర్టువార్దుగాని, కలకత్తా హైకోర్టు కాదు. ఆ హత్య జరిగినదియు నచ్చటఁగాని యిచ్చటఁ గాదుగదా! ముద్దాయి సైత మచ్చటివాఁడే. ఈ కేసులో జ్యూరీలుకూడ మరాఠీ వచ్చినవారే కావలసియున్నది. అప్పుడే, వారికి వాదిప్రతి వాదుల వాదములు సుష్ఠుగా బోధపడును. సాక్షుల మాటలు చక్కఁగా నర్థమగును. ఈ విచారించు పెద్ద లకుఁగాని వీరికి సలహా లొసఁగు సభ్యులకుఁగాని మరాఠీ భాషలో నొక్క ముక్కయు రాదే! పైగా సాక్షులను బిలువరైరి. సాక్ష్యము లేకయే విచారణ ప్రారంభమాయె. ఇది న్యాయ్యమా? విచారించువిధాన మిది యగునా? కేసరిలోని వ్రాఁతలవలన - ఈ దురంతము జరిగినదన్న విూ వాదనలోఁ బస లేదు. తిలకుపయి రాజద్రోహమని కేసు పెట్టిననాఁడు - ఆతని నెందులకు విడిచిపెట్టిరి? ఈ హత్యా ఘట్టములోఁ గుట్రలు జరిగినట్టులుగాని-ఏతన్నిమిత్త మొక

ప్రణాళికను సిద్ధపఱిచినట్టులుగాని - ఒంటరిగా నేవేవియో మంతనములు సలిపినట్టులుగాని యాధారము లేవియు లేవు గదా! రవి యస్తమింపని యీ బ్రిటీషుసామ్రాజ్యములోఁ జెదరువాటుగా నే యిర్వురినో మువ్వురినో పొట్టను బెట్టుకొని స్వరాజ్యము సంపాదింపవలెనని వారు భావించిరనుటలో నర్థమే లేదు. ఈ నేరమికిఁ దిలకుపండితుని సంబంధమే కానరాదు. కావున నియ్యది యాధారరహితమైన యభియోగమని- ఆ యిర్వురు న్యాయవాదు లుద్దండముగా వాదించిరి.

కాని, రాజు తలఁచిన దెబ్బలకుఁ గొదువ లేదన్నట్టులు న్యాయమూర్తు లా కేసు నిలిపి- 'పణ్ణరము' కఠినకారాగార శిక్ష విధించిరి. దేశము నాలుగంచులనుండియు- తిలక్ మనీషి నిర్దోషి యని ప్రజలు ఘోషపెట్టిరి. ఎన్నో పత్రికలు పెద్ద పెట్టున - తిలక్ పండితుని నిర్దోషిత్వమును నిరాఘాటముగఁ జాటినవి. పిన్నలు పెద్దలు - నాయకులు మహానాయకులు - ఎంద ఱెందఱో ముందునకు వచ్చి తిలక్ మనీషి దోషి కాదని వాదించిరి. కాని దొరతనమువారు వారివారి మాటలు లక్ష్యమే చేయలేదు. లండనులో - ప్రివీకౌన్సిల్ దాఁక - ఈ కేసు నడచినది. అచ్చటఁ బునర్విచారణ జరిగి - ఆ శిక్ష 'న్యాయ'మని తీర్పు సెప్పిరి. అవి విక్టోరియామహారాజ్ఞి యేలుబడిలోని రోజులు. బాలగంగాధరుఁ డెంత పండితుఁడో - ఆయన శీలము వర్తనము నెట్టివో విదేశములో సైతము తెలిసిన విద్వాంసులు పెక్కుఱు కలరు. వారిలో ముఖ్యులైన 'మాక్సుముల్లర్ - సర్ విలియమ్ హంటర్' మున్నగు విజ్ఞులు

జోక్యము తీసికొని మహారాజ్ఞికి విన్నవించిరి. ఆమె వారి మాటలు పాటించి యా శిక్షను రద్దు కావించెను.

మహారాష్ట్రమున 1896లో - ప్లేగువ్యాధి యుద్భవించి తీవ్రదశకు వచ్చెను. ప్రజారోగ్యముపట్ల - ప్రభుత్వము పట్టియుఁబట్టనట్లు ప్రవర్తించెను. ఎందఱో - ఆ వ్యాధికి గుఱియై దిక్కు లేని పక్షులువోలె నెక్కడివా రక్కడ రాలిపోవసాగిరి. ఆ యాపదలో బాలగంగాధరుఁ డా రంగములో దూఁకి తన యద్వితీయప్రతిభను మఱొకసారి దేశమునకుఁ జూపెను. ఇట్టి విపత్తులో మీరు చూపెడి యుపేక్ష యిట్టిదని ప్రభుత్వమున కాతఁడు వ్రేలెత్తి చూపెను. తత్క్షణచర్యలు కావించి ప్రజల ప్రాణములు కాపాడవలెనని బిట్టుగా హెచ్చరించెను. నెత్తిని నోరు పెట్టు కొని దేశ మెల్లెడలఁ జాటెను. దానివలన దొరతనము మేలుకొని తద్వ్యాధి నిర్మూలనమునకై గట్టిచర్యలు తీసి కొనెను. అంతమాత్రాన బాలగంగాధరుఁడు సంతృప్తి చెందఁడాయె. తానుగూడ నడుము కట్టుకొని స్వయంసేవక దళములు నెలకొల్పి దేశములో వదలిపెట్టెను. ఆ దళములు రేయుంబవలు - ఊపిరి సలుపని కార్యక్రమముతో వ్యాధి గ్రస్తులకు సేవ చేసిరి. ఉచితవైద్యాలయములు స్థాపించిరి. ఆహారపదార్థములు చవుకగా నమ్మెడి దుకాణములు పెట్టించిరి. ఈ తీరుగ నెన్నోవిధముల - ఆ స్వయంసేవక దళములు - ఆ కష్టసమయములో నాదుకొని ప్రజాసేవ కావించెను.

వంగదేశము రెండుగాఁ జీల్చినపిదప 1908 లో

భారతజాతీయమహాసభలోఁ జీలికలు పుట్టెను. కర్జన్ దొర కావించిన మిత్రభేదమువలన బంగాళములోనేగాక యావద్భారతములోను – అలజడి చెలరేఁగెను. కాంగ్రెసు పెద్దలలో – అతివాదులుగా మితవాదులుగాఁ జీలికలు వాలికలు వెలసెను. విద్యార్థులు పాఠశాలలు కళాశాలలు విడిచివైచిరి. క్రొంగ్రొత్తగా విద్యాపీఠములు స్థాపించిరి. దేశీయులు దేశ్యభాషలవంక నెగఁబడిరి. అగ్గలముగా దేశభక్తి నూటిపోసిరి. కీడులో మేలుగా – ప్రభుత్వము చేసిన వంగవిభజనము మూలమున యావద్దేశమున కొకింత లాభమే యొదవెను.

ఆ యెడ్డడిలో నొక ప్రమాదము పుట్టెను. ముజఫర్ పూర్‌లో – ఒక వంగదేశీయుఁ డావేశము వచ్చి బాంబు విసరెను. అక్కడ నున్నది తెల్లదొరలని వాని యూహ. కాని పాపమా దెబ్బకు నిద్ద ఱాంగ్లేయ యువతు లాహుతి యయిరి. ఆ దెబ్బతో నాంగ్ల ప్రభుత్వమునకు సివమెత్తి పోయెను. ఇంకేమున్నది? ఆ దొరతనమునకే గాదు; ఆంగ్లపత్రికలకు సైతము కావలసినంత మేఁత దొరకెను. ఇది మొదలు – ఒక్క యాంగ్లేయుఁ డీ దేశములో నీ తీరుగఁ జచ్చినా దానికిఁ బ్రతీకారముగా నీ దేశములోఁ బది 'జీవములు' లేవవలెను. అని యీ ధోరణిలో నొక్కుమొగి నాంగ్లపత్రికలు ఘోషించెను.

ఈ పత్రికల వార్తలకు బాలగంగాధరుఁడు కన్నుమని లేచెను. కేసరిలోఁ బూర్వాపరములు హేతువాదములో విమర్శించెను. బెంగాలువారు బాంబులు విసురుట మంచిపద్ధతి కాదు. ఆ మాటకు వచ్చిన – అది యొక

దొడ్డ నేరమియే. కాని, కీలకము విచారించినచో నీ ప్రజల యుద్రేకమునకుఁ గారకు లెవ్వరు? ముమ్మాటికి - ఈ ప్రభుత్వమే. పుండుపయిఁ గారము చల్లినట్లులు - అసలే ప్రజల హృదయము గాయపడియుండఁగా - ఆంగ్లపత్రిక లీ వ్రాఁతలు వ్రాయుట యొప్పగునా? ఇప్పుడైన నిది తప్పుగాఁ దెలిసికొని దిద్దుకొనవచ్చును. మించిపోయినది లేదు. అని తిలక్ పండితుఁడు హెచ్చరిక చేసెను.

దానితో దొరతనమునకు గంగవెఱ్ఱు లెత్తెను. ఇఁక వీని వ్రాఁతలు సైఁపరాదని నిశ్చయమునకు వచ్చెను. బొంబాయిలో గంగాధరుఁడు మిత్రునియింట నిదురించు చుండఁగా నడురేయి యొక యధికారి వచ్చి 'అరెస్టు వారంటు' అందించెను. పత్రికాసంపాదకీయమే దాని కాధారమఁట. ఆ వచ్చిన యధికారితో నాతఁ డప్పుడే ప్రయాణమాయెను. ఆ ప్రయాణవేళ దారిలో గంగాధరుఁడు హాయిగా నిదురించెనఁట! అవురా వాని చిత్తస్థైర్యము! తన వ్రాఁతలు దొరతనమునకుఁ దప్పుగాఁ దోఁచునని యాతఁ డెఱుఁగనే యెఱుఁగును. ఇందులో వింత యేమున్నది?

తిలకుపయి రాజద్రోహమను నేరము మోపిరి. విచారణ పెట్టిరి. ప్రభుత్వమునకు బాలగంగాధరుఁడు బద్ధవిరోధి యని తీర్పు చెప్పిరి. ఆతఁడు దోషి కాదని ప్రజలలో నొక్కటే ఘోష. ఆ మాటలు దొరతనమునకుఁ జెవి కెక్కవు. ఆఱేండ్లు కఠినశిక్ష విధించి 'మాండలే' జైలునకుఁ బంపిరి. ఏఁబదియేండ్ల వయస్సు మీఱిన యా మహా పండితుఁడు మఱలఁ దమలో వచ్చి కలియునన్న నమ్మకము

ప్రజలలో లేకపోయె. కాని యా యాఱేండ్లు కడచిపోయెను. బ్రహ్మాండమైన 'గీతారహస్య' మను మహాగ్రంథ మప్పుడే యాతఁడు వ్రాసెను. విడుదల జరిగినవెంటనే యావద్భారతములోఁ గాఢమేఘములు గ్రమ్మి ప్రజలలో నల్లడితల్లడి పుట్టెను. అనఁగా నయ్యది 1914వ సంవత్సరము. ఘోరమైన ప్రపంచ ప్రథమ మహాసంగ్రామము దాపరించిన దప్పుడే.

ఈ యాఱేండ్లుగా బాలగంగాధరుఁడు దేశములోని రాజకీయములకు దూరమై పోయెను. అతివాదులయు మితవాదులయుఁ జీలికలచే - వాలికలచే కాంగ్రెసుపక్షము చిక్కి సగమై జవసత్త్వములు గోలుపోయెను. అప్పుడు సింగమువోలె గంగాధరుఁడు రంగములోనికి దూఁకి విశ్వప్రయత్నము చేసి కాంగ్రెసులో రెండుపక్షముల నేకము చేసెను. డాక్టరు - అనిబిసెంటు, ప్రారంభించిన 'హోమ్ రూలు' ఉద్యమములోఁ జేయి గలిపి పనిచేసెను. దేశములో నొకవిధమైన చైతన్యము రూపెత్తెను.

యుద్ధపు నెద్దడిలో నీ దేశీయుల కేవేవియో యిత్తుమని ప్రభుత్వము బులిపించెను. త్రవ్వి తలకెత్తెదమన్న యా ప్రభుత్వమే - ఆ యక్కఱ తీఱినవెనుక మొండి చేయి చూపెను. ఆ ఘట్టములో గాంధిజీ ముందునకు వచ్చెను. ఆయన చూపిన సహాయనిరాకరణోద్యమమునకు - అప్పుడే ప్రారంభదశ. తిలక్ మనీషి గాంధీజీకన్న నుద్రేకము గల మానిసి. స్వాతంత్ర్యము 'నా జన్మ - హక్కు'ని తొట్టతొలుత నిర్భయముగాఁ జాటిన మేరుధీరుఁడు గంగాధరుఁడు. ధైర్యస్థైర్యములలో - ఆతని కాతఁడే సాటి. అట్టి వీరావ

తారమునకు గాంధిజీ చూపిన 'సహాయనిరాకరణము' చవి గొలుపదాయె. ఆ యేఁడు కాంగ్రెసుమహాసభకు బాల గంగాధరుఁ డధ్యక్షుఁడు కావలెనని ప్రజలలో నాందోళన బయలుదేఱెను. కాని యప్పటి పరిస్థితులనుబట్టి-ఆ యేఁడు లాలాలజపతిరాయి - అధ్యక్షుఁడాయె. తన సర్వభారము గాంధిజీ భుజస్కంధములపయి నిలిపి యిఁక నీ దేశము నుద్ధరింపను జాలినవాఁడవు నీవే యన్నటు లాయన చూపిన సహాయనిరాకరణోద్యమము ప్రారంభదశలోనే బాలగంగాధరుఁడు పరమపదించెను.

ఒకప్పుడు తిలక్ పండితుని దుయ్యఁబట్టుచు విదేశ్యుఁ డొక్కఁడు గ్రంథ మొకఁడు వ్రాసి ప్రకటించెను. ఆతని పేరు 'సర్ వాలంటైను షిరాల్'. ఆతఁడు గంగాధరునిమీఁద నెన్నెన్నియో యపవాదములు కల్పించి యతఁడు సహింపరాని క్షమింపరాని మహాద్రోహి యని దూషించెను. భారతదేశములో జరుగుచున్న సర్వదురంతములకు బాల గంగాధరుఁడే మూలమని దానిలోని పిండితార్థము. అభిమానధనుఁడగు తిలక్ మనీషి కా వ్రాఁతలు దుస్సహములయి దుర్భరములై హృదయములో గాయము చేసెను. ప్రివీకౌన్సిలులో న్యాయము దొరకునను భావముతో గంగాధరుఁ డా గ్రంథకర్తపయి - ఇంగ్లండులో దావా వేసెను. దావాలో స్వయముగ వాదింపను బూని యా దేశము పోవుట కనుమతి కోరెను. ఎంతో యట్టహాసము చేసి ప్రభుత్వము చాల నాలస్యముగా - ప్రయాణమున కనుమతి యిచ్చెను. కాని, యావల నేమి తోఁచెనోగాని దానిని

గాదని రద్దుచేసెను. పైగా-కోర్టులో వాదింపను న్యాయ వాదినిగూడ వా రంగీకరింపరైరి. ఈ దావావిషయమయి సీమలోఁ బెద్ద 'రగడ' జరిగెను. ఆంగ్లప్రభుత్వము బ్రదు కయ్యెయు దీనిమీఁదనే యాధారపడినట్టులు వాదోపవాద ములు చెలరేఁగెను. జరుగవలసిన న్యాయము తిలక్ పండి తునకు జరుగకపోఁగా-ఆతఁడే కర్చులకయి మూఁడు లక్షల రూప్యము లా దొర కీయవలయునని తీర్పు సెప్పిరి. ఆ ఘట్ట ముతో బాలగంగాధరుఁ డార్థికముగాఁ బెద్ద దెబ్బ తినెను.

బాలగంగాధరుఁడు విదేశములకుఁ బోయినపుడు - దేశమునుగూర్చి చెప్పవలసినవి చెప్పును; చేయవలసిన ప్రచారము సేయును. భారతదేశవిద్యార్థు లా దేశములో విలాసముగాఁ గాలక్షేపము సేయుచు మాతృభూమినే మఱచి పోయి హాయిగా విహారము సలుపుట గంగాధరుఁడు గుఱు తించెను. దాని కాతఁడు వగచి - ఆ యువకుల నొక్కచోఁ జేరిచి మాతృదేశము దీనదశను గన్నులకుఁ గట్టినట్టులు వారికి బోధించును. అస్వతంత్రదేశములోఁ బుట్టి స్వదేశము స్వభావ మన్నింపనేరని యా కుఱ్ఱలకు దేశభక్తి నూఱిపోసి దివ్యమైన జ్ఞానము కలిగించును. ఆ విధముగా నాతఁడు చేసిన ప్రచారమువలన - ఆ దేశములోసైత మనేకసంఘము లేర్పడి భారతదేశమునకు స్వాతంత్ర్య మీయవలెనని యాందోళన చేయసాగెను. దేశమును మఱచి దేశములోని సొమ్మును గవ్వలుగా గ్రచ్చులుగా విదేశములోఁ గర్చు సేయు కుఱ్ఱకారునకిట్టి కార్యక్రమము లెన్నో యాతఁడు నేర్పి వారికి వెలుఁగు చూపెడివాఁడు.

గంగాధరుఁ డహోరాత్రములు రాజకీయక్షేత్రములో మునిఁగినను విద్యావ్యాసంగము నేమాత్రము విడువ నేరఁడు. తీఱిక దొరకెనా దొరకిన పుస్తకము లన్నియుఁ జదువును. ఆపయి నేదో వ్రాసితీఱును. కారాగారములో నున్న మూఁడు పర్యాయములలో ముచ్చటగా మూఁడు గ్రంథములు వ్రాసెను. వానిలో, మాండలే జైలులో వ్రాసిన 'గీతారహస్య' మపూర్వమైన యమూల్యమైన దొడ్డ గ్రంథము. బాల్యమునుండియు బాలగంగాధరుఁడు గీతాధ్యయనము చక్కఁగాఁ జేసెను. గీతోపదేశములు మహోత్కృష్టములని వాని గాఢవిశ్వాసము. హైందవములోఁ బ్రతివ్యక్తియు గీతను జదువవలెనని యాతఁ డాదేశించును. భగవద్గీత విలువ బాఢముగాఁ దెలిసిన మహా విద్వాంసుఁడు. కావున-అతఁడు వ్రాసిన యా వ్యాఖ్య యట్టి మహోన్నతస్థితికి వచ్చెను. యావద్భారతములో - ఏ భాషలోను - అట్టి బృహద్గ్రంథము పుట్టియుండలేదు. ప్రపంచములో భగవద్గీతను మించిన మహాగ్రంథమే లేదని విజ్ఞుల భావము. అట్టి గ్రంథమున కాతఁడు జైలులో వ్రాసిన వ్యాఖ్యానమును దొరతనము కైవసముచేసికొనియె. అడిగినను - ఈయలేదు. ఆ వార్త విని ప్రజలు చింతాక్రాంతులైరి. వారి యుత్కంఠ తిలక్ పండితుఁడు గుర్తించి, ఓహో సోదరులారా, మీరేమియు విచారపడవలదు. నేను వ్రాసిన గీతావ్యాఖ్యానము వ్రాఁతప్రతిని విదేశప్రభుత్వము వశపఱుచుకొనవచ్చును. పోనీ-అంతేకదా వాండ్రు సేయనేర్చినది! నా కడుపులో నున్న జ్ఞానమును వారేమైనఁ దీసికొని

దాఁచుకోఁగలరా? దోఁచుకోఁగలరా? ఆ వ్యాఖ్యానమంతయు నాకుఁ గంఠస్థమే. ఇదిగో మఱలఁ గొలఁదిరోజులలో దానిని జక్కఁగా వ్రాసి యిత్తునని పలికి యట్లే పూర్తిచేసి లోకమున కిచ్చెను.

ఆదిలో జైలులో వ్రాసినది, 'ఆర్యుల నాగరికత - వారి యావిర్భావము'. ఇది యనేక వ్యాసములు కూర్చిన చక్కని సంపుటి. ఆర్యసంస్కృతిని గూర్చి యిందు సమగ్రముగ వర్ణించెను. క్రీస్తునకు నాలుగువేలయేండ్లకు మున్నే గ్రీకులు - ఇండియాదేశీయు లొకే తెగకుఁ జెందినవారని సోపపత్తికముగా నిర్ణయించెను. ఇందలి విషయవైశద్యము - పాండితీప్రకర్ష - దూరదృష్టి - సునిశితవిమర్శనము గుర్తించి పాశ్చాత్యవిద్వాంసులు భాషాతత్త్వవేత్తలు పరమాశ్చర్యమందిరి. అమెరికాదేశీయు లత్యంతము శ్లాఘించిరి. గణితశాస్త్రములో - తిలక్ మనీషి లోఁతులు తడవిన పాండితిని గడించెను. జ్యోతిర్విజ్ఞాన మాతని సొత్తు. ఆర్యుల యావాసప్రవాసములనుగూర్చి పాశ్చాత్యపండితులలో విభిన్నవాదములు కలవు. బాలగంగాధరుఁడు పదేండ్లుగాఁ బరిశ్రమించి పెక్కు గ్రంథములను జదివి వేదములను బఠించి 'వైదిక నిలయ' మన్న గ్రంథము వ్రాసెను. అందు - ఆర్యుల నివాసదేశము - ఉత్తరధ్రువమని ధ్రువపఱిచెను. ఈ గ్రంథము 1903 లో వెలువఱిచెను.

ఆ పెద్దవయస్సులో నిరంతరపరిశ్రమమువలన తిలక్ మహాశయుని యారోగ్యము క్షీణింపసాగెను. దానికి దోడుగా ఋణబాధయు నా పండితుని గ్రుంగఁదీసెను.

సీమలోని దావాకై యచ్చుకొన్న మూఁడులక్షల ఋణము-ఎట్లు తీఱునా యని యహోరాత్రము లోకటే యాందోళనము. ఇది గుర్తించి మహారాష్ట్రప్రజ లా మూఁడు లక్షల రూప్యములు ప్రోవుచేసి యా మహాశయున కిచ్చిరి. ఆతని యఱువదినాలవ జన్మదినోత్సవము జరుపవలెనని పూని 'కోల్బా'వారు వాని నాహ్వానించిరి. ఆ యుత్సవమునకుఁ బోయి తిలక్ పండితుఁడు మఱలి వచ్చుచుండఁగా దారిలోనే జ్వరము తగిలెను. అది మిక్కిలి ప్రకోపించెను. ఉద్దండులైన వైద్యు లెందఱెందఱో కంట వత్తిడికొని చికిత్సలు చేసిరి. కాని ప్రయోజనము లేకపోయెను. నిమిషనిమిషము వ్యాధి పెంపయి ప్రమాదపరిస్థితి దాపరించెను. ఎచ్చటివారచ్చట-ఆ మహామహుని కారోగ్యము ప్రసాదింపుమని భగవంతుని బ్రార్థించిరి. బంధువులు మిత్రులు-అనుచరులు - ఆప్తులు నాయకులు మహానాయకులు నెందఱెందఱో సర్వదేశము నుండియు నాతని పజ్జకు వచ్చిరి. గాంధిజీసైత మా చివరి గడియ వఱకచ్చటనే మకాము పెట్టెను. 1920 జులై 31వ తేదిని - చతురంభోధిపరీతభూవలయమును శోకసాగరమున ముంచి లోకమాన్యుఁడు దివంగతుఁడాయెను.

ఆ నాఁడు నడురేయికిఁ బోయిన యా దుర్వార్త తెల్లవాఱకమునుపే యెల్లదేశములోఁ బొక్కెను. అది విని నాలుగంచులనుండియు వచ్చిపడిన జనమున కంతులేదు. నేల యీనినట్లు నింగి వర్షించినట్లు - ఇసుక వైచిన రాలని యా జనములోఁ గంటఁ దడివెట్టని మానవుఁడే లేఁడు. పైగా - అప్పుడు జోరున వర్షము. అది యొక లెక్కగాఁ గైకొనక -

ఆ వచ్చినజనము భక్తిప్రపత్తులతో నిస్తరంగజలధివోలె నిలిచిపోయెను. పూనానుండి బొంబాయికి - ప్రత్యేకముగా రైళ్లు నడపిరి.

సరిగా - ఆ దినముననే, అసహాయోద్యమము ప్రారంభింపవలెనని యంతకు మున్నె గాంధిజీ సంకల్పించుకొని యుండెను. లోకమాన్యుని యస్తమయమువలన నాఁటి కా యత్నము కట్టిపెట్టెను. బొంబాయిలో - అద్భుతమైన 'హర్తాళ్' జరిగెను. ఎవరిపనులు వారు కట్టివైచిరి. బంధువు లందఱు వచ్చినపిదప భౌతికదేహమును బహిరంగముగా సమున్నతప్రదేశమున నుంచిరి. అందఱు వచ్చి యా చివరి దశలో - ఆ దేహమును దర్శించిరి.

దహనసంస్కారమునకై - ఆ భౌతికదేహము నూరేఁగింపుగాఁ దీసికొనుపోవు దృశ్య మిట్టి దట్టిదని వర్ణింపలేము. గాంధిజీ - షౌకతాలీ - సరళాదేవి - లజపతిరాయి మున్నగు మహానాయకులు ముందు నడువఁగా విచారవదనులై శోకమయమూర్తులై యెల్లవారు శ్మశానముదాఁక వెళ్లిరి. బొంబాయిలో వెనుక, దిగ్దంతులైన దాదాబాయినౌరోజి - ఫిరోజిషా మెహతాల యంత్యక్రియల సమయములోనైనత మంత జనము లేరని చెప్పుకొనిరి. వచ్చినవారిలోఁ బెక్కు-మంది రూపాయలే విరఁజిమ్మిరి. పుష్పవర్షములు కురిసిరి. చితిపై - పద్మాసనములో- తిలక్‌పండితుని దివ్యదేహమును గూరుచుండఁబెట్టిరి. శాస్త్రీయముగ సర్వసంస్కారము జరిగెను. గాంధిజీ - లజపతిరాయి, ఆ దివ్యమూర్తినిగూర్చి యుపన్యసించిరి.

యావద్భారతములో - ఆ ఘోరవార్త విన్నవెంటనే సంతాపసభలు జరిగెను. ఒక వారము వారముగా వార్తా పత్రిక లన్నింట నీ వార్తలే నిండిపోయెను. పూనాపట్టణములో - పాఠశాలలు కళాశాలలు మూసివైచిరి.

ఇంతవట్టు - యావద్భారతములో జన్మించిన మహానాయకు లందఱిలోను బాలగంగాధరుఁడే మహావిద్వాంసుఁడు. ప్రపంచవిద్యావేత్తలలో నొకఁడనియుఁ జెప్పవచ్చును. ఒక్క గాంధిజీ తక్క - అంతగాఁ బ్రజల విశ్వాసము చూఱఁగొన్న మహానాయకుఁడు మనదేశములో మఱొకఁడు లేఁడు. ఆతఁ డెంతటి విద్యావంతుఁడో యంతటి దేశభక్తుఁడు. మహానాయకున కుండవలసిన సర్వలక్షణము లామూర్తిలో నిండియుండును. ఐంద్రజాలికుని శక్తివోలె నాతని ప్రతిభ ప్రజలలో మిక్కిలిగాఁ బనిచేయును. ఆతనిలోని సర్వలక్షణములను గుర్తించి సర్వప్రజ లాతని 'లోకమాన్యుఁడ'ని సంభావించిరి. ధైర్యస్థైర్యములలో-ఆ వ్యక్తిని బోలు నాయకులు మనకు లేరు. సామాన్య ప్రజలలోఁ జొచ్చుకొనిపోయి వారి యభిరుచులు గుర్తించి యక్కఱలు తీర్చుటలో మిక్కిలి యుత్సాహము చూపు మహానాయకుఁడతఁడు. సాహసము - కార్యదీక్ష చక్కఁగాఁ బ్రజలకు నూఱిపోసిన మహాఘుటికుఁ డాతఁడు. పదియేండ్లుగాఁ గారాగారములో నవసి యుండవలసివచ్చినను భయమన్నమాటయే దగ్గఱకు రాని మహామనీషి యాతఁడు. కాంగ్రెసు సంస్థలో నాతని ప్రభావ మద్వితీయమై వెలసెను. పూర్వశకములో యావజ్జీవితము కష్టపరంపరలలోఁ గడపిన కర్మయోగి

లోకమాన్యుఁ డొక్కఁడే.

కేవలము విద్యార్థులు నేర్వవలసిన విశేషము లాతని జీవితములో నెన్నో యున్నవి. ఆతఁ డయిదురూప్యముల జీతములోఁ బనిచేసిన రోజులు కలవు. గణితశాస్త్రములో సంస్కృతసాహిత్యములో గురువు లేకయే. స్వయముగాఁ బాండితి గడించెను. విద్యాతృష్ణలో - అచ్చముగాఁ దండ్రి చాలే వచ్చెను. పాశ్చాత్యనాగరికతకై యందఱు పరవళ్లు త్రొక్కు నా రోజులలో సైతము సనాతనసిద్ధాంతములపట్ల నగ్గలమైన భక్తిప్రపత్తు లా వ్యక్తికిఁ గలవు. దేశచరిత్ర యెఱిఁగి దేశభక్తి కుదిరి నిచ్చలు దేశమును బ్రేమింపవలెనని యాతఁ డహోరాత్రములు నూఱిపోసెను. అట్టి మహా మహుఁడు లోకమాన్యుఁడు మహారాష్ట్రమునకే గాదు - యావద్భారతమునకును మకుటము లేని మహారాజగుటలో వింత యేమున్నది ?



# శ్రీ లాలా లజపతిరాయి

భవ్యమైన యీ భరతఖండమునకు - పాంచాలరాష్ట్రము ప్రధానద్వారమువంటిది. క్షాత్రవంతములైన దేశములలో-పాంచాలము మున్మొదటిది. ఆ ప్రాంతములోని రాజకీయము మాట యెత్తినపుడు లాలా లజపతిరాయి జ్ఞప్తికి వచ్చి తీఱును. అతని పేరు స్మరించినపుడు 'పాంచాలకేసరి' బిరుదము తలవనితలంపుగ నోటికి రావలసినదే. సాంఘికముగా రాజకీయముగా-పంజాబు పరగణా-ఒక మహోన్నతదశకు వచ్చినదన్నచో దానికిఁ బ్రధానకారణము లాలా లజపతిరాయి.



పంజాబులోఁ బేరుగన్న వైశ్యకుటుంబములో లాలాజీ పుట్టెను. అతని పితామహుఁడు లూధియానా మండలములో 'కరణీకము' చేసెను. లాలాజీ తండ్రిపేరు రాధాకృష్ణ. అతఁడు విద్యాఘట్టములో మంచిపేరు గడించినదిట్టు. బాల్యములోనే యాతనికిఁ బ్రభుత్వ ముచితవిద్యార్థివేతన మొసంగి గౌరవించెను. ప్రతికక్ష్యలోను బ్రథముఁడనిపించుకొనుటయే గాదు; 'నార్మల్' పరీక్షలో-పంజాబుమొత్తమున సర్వప్రథ

ముఁడుగా నుత్తీర్ణుఁడాయెను. ఆవల నాతఁ డధ్యాపకవృత్తి నవలంబించెను. ఉదారమైన భావములలో నుత్తమమైన నడవడికలో రాధాకృష్ణ సర్వోత్తముఁడు. సారస్వతములో నాతని కున్న యభిరుచి యనన్యసామాన్యము. ఉర్దూ భాషలో మంచి కవనము సెప్పనేర్చెను.

అట్టి విద్యావంతుని కడుపున లజపతిరాయి యుద్భవించెను. అతఁడు 1865 జనవరి 28 వ తేదిని - ఫిరోజ్‌పూర్ జిల్లా 'ఢోడి' గ్రామములో మాతామహుని యింటఁ బుట్టెను. ఆ తండ్రి కాతఁడే మొదటి మగ సంతతి. సమయములో నక్షరాభ్యాసము చేయించిరి. చదువులోఁ జక్కఁగాఁ గుఱ్ఱవాఁ డెదుగుచుండెను. తండ్రి, యుద్యోగి యగుట వలనఁ దనయుఁడు వానివెంట నూరూరఁ దిరుగవలసివచ్చెను. లూధియానా - అంబాలా హైస్కూళ్ళలోఁ గొన్నాళ్ళు చదివి యాతఁ డావల 1880లో కలకత్తా విశ్వవిద్యాలయము వారి 'ప్రవేశపరీక్ష'లో నుత్తీర్ణుఁడయ్యెను. అప్పుడు లాహోరు వెళ్ళి - ఉచితవిద్యార్థివేతనము సంపాదించి ప్రభుత్వకళాశాలలో-ఇంటర్మీడియట్ లోఁ జేరెను. రెండవయేఁటఁ దండ్రిగారి ప్రోత్సాహముచే నది మానుకొని సామాన్యమైన ప్లీడరీపరీక్షకుఁ గట్టి దానిలో నెగ్గెను.

లజపతిరాయి, తల్లిదండ్రుల కుద్దిష్టమైన బిడ్డ. కుశాగ్రబుద్ధియగు నాతని నెన్నఁడును దల్లిదండ్రులు దండించి యెఱుఁగరు. ప్రవర్తనలోసైత మాతని నెవ్వరు వ్రేలుపెట్టి చూపవలసిన పనిలేదు. ఆతని తల్లియుఁ దండ్రివలె మంచి గుణవంతురాలు. ఆమె శీలము - సౌజన్యము - దయాదాక్షిణ్య

ములు శ్లాఘనీయములు. మాతృదేవి ప్రతిభ తనపయి
నెంతో పనిచేసినట్లు లాలాజీయే చెప్పుకొనెను. తన సంస్కా
రమున కంతకు — ఆమెయే మూలమని యాతని విశ్వాసము.
ఒకసారి యాతఁ డిట్లు వ్రాసెను:—

'మా యమ్మకు నీ జన్మములో నే నెంతో ఋణపడి
యున్నాను. అతిథిసేవ — ఔదార్యము — దానధర్మములను
గూర్చి యామె నిచ్చలు నాకు బోధించిన బోధలు నేఁటికిని
నా చెవులలో మాఱుమ్రోగుచున్నవి. ఎవ్వఁడైన జోస్యుఁడు
వచ్చి మీవాఁడు పెద్దవాఁడైనపిదప మహాదాత యగునని
యొక్క ముక్క చెప్పినఁ జాలు; పట్టరాని సంతోషముతో
నుబ్బిపోవు తత్త్వము — ఆమెది. దినచర్యలలో నాకు ముఖ్య
ముగా నిత్యము బోధించు సూత్రములలో, అనాథరక్ష
ణము — అతిథిపూజ ముమ్మొదటివి. ఎన్నఁడు నామె లాఁతి
వారిని నిందించి యెఱుఁగదు. కాని యామెకు 'స్వాభి
మానము' జాస్తి. ఎవ్వరైన నిష్కారణముగా నొక్క మాట
యన్నచో బొత్తిగా సహింపనేరని స్వభావము. మాటకు
మాట యనవలసినదే. ఆ మాటలోను గఱుకుపాలు కావలసి
నంత. ఆమె యిట్టిదయ్యు నా కొసంగిన శిక్ష యత్యద్భుత
మని చెప్పవలెను. ఇఁక మా తండ్రి విషయమయి చెప్పనేల!
ధర్మదీక్షలో — పరమతసహనములో— పాండితీప్రకర్షములో—
దేశసేవలో—ఆయన నేర్పిన ముక్కలు నాకు వేదవాక్కులు.
నాలో నేదైన విశిష్టత రవ్వంతేని యున్నచో — అది యం
తయు నాయన భిక్షయే; ఆయన చలువయే. ఆ తల్లిదండ్రుల
ఋణము నీ జన్మములోఁ దీర్పలేను.'

లాలాజీ వ్యక్తిగతమైన విశిష్టతకు 'సర్ సయ్యద్ - అహమ్మద్' సైతము కొంత కారణమనవచ్చును. ఆతఁడా రోజులలో నొక గొప్ప ఉర్దూపత్రికకు సంపాదకుఁడు. దేశ భక్తి నగ్గలముగాఁ బ్రబోధించు నా'పత్రిక'లోని గంభీర వ్యాసము లెన్నో లజపతిరాయిని జక్కఁగా నాకర్షించినవి. తండ్రి వెంటఁ దిరుగుచుఁ జదువుకొనుచున్న యా బాల్యదశ లోనే వార్తాపత్రికలు చదువుట-పాఠశాలలో నేవో సభలు చేయుట - ఉపన్యాసము లిచ్చుట యాతని కభ్యాసమై పోయెను. హిందూముస్లిముల మైత్రినిగూర్చి సయ్యద్ - అహమ్మద్, ఒకప్పుడు చక్కఁగాఁ బ్రోత్సహించుచుఁ బ్రబోధించెను. ఆ యిరువురు నాకు రెండుకన్నులని వర్ణించిన రోజులు కలవు. ఆతఁడే యావల బుద్ధి పెడతలఁబట్టి జాతీయ విచ్ఛిత్తికి హేతువైన భేదభావమును నూటిపోసెను. ఆ వ్రాఁతలు పెనుభూతములై దేశములోఁ గల్లోలము రేఁపెను. అవి యొక జాలుగా సాగి యెల్లయెడల వెల్లువలై యఖండ మైన యీ భరతఖండమును రెండుగాఁ జీల్చివైచెను. ఈ విషబీజమును - ఆ నాఁడే లజపతిరాయి పసిపట్టెను. మున్ముందట మహమ్మద్ సయ్యద్ వ్యాసములకు లాలాజీ యెంత విలువ యిచ్చెనో యావల వాని నంతకు మిక్కిలిగా ఖండనమండనములచేఁ జీల్చి చెండాడెను. మతద్వేషమును బాఢముగాఁ బ్రకోపింపఁజేసిన - యా పిచ్చివ్రాతలకుఁ గృత్య విచారణ చేసి సమాధానము చెప్పుటలో లజపతిరాయి మొనగాఁడై ముందునకు వచ్చెను.

సామాజికముగా సార్వజనిక సేవాభావముగా లాలాజీ,

దొడ్డవాఁ డగుటకు ముఖ్యకారణము — ఒకానొక మహాను భావుఁ డనుట మనము మఱచిపోరాదు. ఆయన పేరు దయానందసరస్వతి. పాశ్చాత్యవిద్యతోపాటు—ఈ గడ్డలో సంక్రమించిన — అనార్యసంప్రదాయములను విపరీతసిద్ధాంతములను నిరోధింపవలెనని దయానందులు తలపెట్టిరి. విధ్వంసక శక్తులు వీరవిహార మొనర్చుచు హిందూసంఘమును హిందూ సంస్కృతిని గూఁకటివేళ్ళతోఁ బెకలింప నువ్విళులూరుచు నట్టహాసము సేయు నారోజులలో — ఆ మహర్షి 'ఆర్యసమాజమును' స్థాపించి హైందవజాతిని గాపాడెను; సనాతన ధర్మము నుద్ధరించెను. వేదప్రామాణ్య మంగీకరించుచు సంఘసంస్కరణకు నడ్డు తగులని — ఒకానొక గొప్ప జాతీయోద్యమమై — ఆర్యసమాజము వర్ధిల్లెను. ఆ మహర్షి ప్రబోధములు లాలాజీని ప్రుట్టినాఁ నాఁకట్టివై చెను.

పంజాబులో దయానందుల ప్రచారము ముమ్మరముగా సాగుచున్నరోజులు. నిద్రాణదశలో నాదమఱచి యున్న హైందవము నెమ్మదిగా మేలుకొనుచుండెను. ఆర్యసమాజ కార్యకర్తలు దేశములో నాలుగంచుల కెగఁబ్రాఁకి కేవలము మూఢాచారపరాయణులగు హైందవులకు శాస్త్రార్థములు విప్పిచెప్పుచు సత్యమును బోధింపఁజొచ్చిరి. ఆ దశలో లాలా లజపతిరాయి యిర్వురు మిత్రులను వెంటవైచుకొని — ఆర్యసమాజములోఁ జేరెను. ఆ యిర్వురును సామాన్యులు కారు. వారి ప్రభావము లాలాజీ జీవితములో లెస్సగా — ప్రతిబింబించి యుండును. ఒకరు గురుదత్త విద్యార్థి; ఇంకొకరు లాలా హంసరాజ్. ఆ ముప్పురు

మహామూర్తులువోలెఁ గలసిమెలసి-ఆర్యసమాజములోఁ జేరి చేసిన దేశసేవ యింతయని చెప్పలేము. అది యొక పెద్ద గ్రంథమే యగును. దయానందులు పోయినపుడు లాహోరులోఁ బ్రజ లందఱు శోకములో మునిఁగిపోయిరి. అప్పుడు సంతాపసభలో లాలాజీ యిచ్చిన మహోపన్యాసము చరిత్రాత్మకఘట్టమై శ్రోతల నుఱ్ఱూఁత లూఁగించెను.

లాలాజీ మంచి పట్టుదల గల మానిసి. విద్యార్థిదశలోనే – ఆర్యసమాజములోఁ జేరి దేశసేవలో మునిఁగిపోవుటఁ జేసి చదువుసంధ్యలకు స్వస్తి చెప్పవలసి వచ్చెను. చేతికి వచ్చిన ప్లీడరీపట్టాతో స్తిమితపడి 'హిస్సారు' పట్టణములో న్యాయవాదిగాఁ గుదిరెను. అతఁడు యోగ్యుఁడు ప్రతిభావంతుఁడు నగుటచే న్యాయవాదివృత్తిలోఁ జక్కఁగా రాణించెను. ఆ ప్రాంతములోఁ బెద్ద వకీలుగాఁ బేరుపొందెను. టక్కుటమారములు నిండిన 'కేసుల' నెన్నఁడు పట్టియెఱుఁగఁడు. పీడితప్రజల పక్షమున వాదించుటయే యాతఁడు నేర్చిన విద్య. దిక్కుదెస లేనివారివంక మ్రొగ్గుటయే యాతని జీవితపరాయణము. అందువలన దేశములో నాతఁ డపార కీర్తిధనము సముపార్జించెను.

సార్వజనిక కార్యములలోఁ బాల్గొనుచు నందఱకుఁ దలలో నాలుక యై మెలఁగనేర్చెను. అతఁ డా చొఱవచే నా పట్టణములో – ఆర్యసమాజము నెలకొల్పెను. మొదటగా నాతఁడే యా సంస్థకుఁ బదునేనువందల రూప్యములు దాన మిచ్చెను. అతని మహౌదార్యమువలన – ఆ సంస్థలోఁ బ్రజలకు మఱింత భక్తిశ్రద్ధలు పుట్టుకొని వచ్చెను. లాలాజీ

యింటనే వారమువారము నియమముగా సభలు - సమావేశ ములు జరుగుచుండును. ఆర్యసమాజముతో పాటు సంస్కృత విద్యాలయ మొకటి స్థాపించెను. 'హిస్సారు' మునిసిపాలిటీకి జీతనాతములు లేని హోదాలో - కార్యదర్శిగా నాతఁడు నియమితుఁ డాయె. ఆ మూఁడేండ్లలో లాలాజీ చేసిన మంచి పనులు చూపిన చాకచక్యమునుగూర్చి ప్రభుత్వమే యెంతో మెచ్చుకొనెను. ఆ తీరుగ నాతఁడు స్థానికస్వపరిపాలనా కార్యక్రమములో సంపూర్ణమైన యనుభవమును సంపా దించెను.

లాలాజీ, హిస్సారులో మకాము పెట్టినను దఱచుగా లాహోరు పోవుచుండును. అచ్చట సభలలో - సమావేశ ములలోఁ జక్కఁగాఁ బాల్గొని - ఆర్యసమాజమున కుద్దీప్తి కూర్చుచుండును. మిత్రులైన గురుదత్త - హంసరాజులతోఁ గలిసి లాహోరులోఁ గళాశాల నొకటి స్థాపించెను. దాని పేరు, దయానంద - ఆంగ్లో వేద కళాశాల. పంజాబులో దానికి నేఁటికి నద్వితీయమైన ప్రతిష్ఠ యున్నది. దయానం దుల యాదర్శముల కనుకూలముగా - సంస్థాపకుల సంకల్ప మున కుద్దిగా నేఁటికిని విద్యాప్రచార మచ్చట సాగుచునే యున్నది. యమ్. ఏ వఱకు దానిలోఁ జదువు చెప్పెదరు. అందు హిందీ - సంస్కృతభాషల కెంతో ప్రాముఖ్య మున్నది. పైగా - పారిశ్రామికవిద్యకుసైతము మిక్కిలి ప్రోత్సాహము కలదు. ఇప్పటికి నయ్యది పంజాబులోఁ బ్రథమశ్రేణిలో లెక్కకు వచ్చు కళాశాలయే యగుటకు సంస్థాపకుల సంకల్ప శుద్ధియే కారణ మనవచ్చును.

ఆ కళాశాల స్థాపించినది మొదలు లాలాజీకిఁ దీఱికయే లేదు. దాని 'బాధ్యత' సర్వము - ఆతని భుజస్కంధములపయి నిలిచిపోయెను. ధనముకోసమై యూరూరఁ దిరుగవలసి వచ్చెను. నిర్వాహకముగా నొక 'కమిటీ'ని నెలకొలిపిరి. దానిలో లాలాజీయే ముఖ్యుఁడై యొక ప్రణాళిక నేర్పఱిచెను. కళాశాలకై వకీలుపని కట్టిపెట్టి నిరంతర మూఁపిరిసలుపని కార్యక్రమముతోఁ బెద్దపెద్ద పట్టణములకుఁ బోయి యుపన్యాసము లిచ్చును; కర్తవ్యము బోధించును. ఆతని మాటలకు ముగ్ధులయి - ఆ సంస్థలో ననురాగము పుట్టి యెంద ఱెందఱో దానికి ధనము క్రుమ్మరించిరి. దేశములోఁ దిరిగి యీతీరుగ జవసత్త్వములు ధారవోయుటచే నారోగ్యము సన్నగిల్లి యాతఁడు హిస్సారు రావలసివచ్చెను.

లాలాజీ హిస్సారులో నుండుటకన్న రాజధానీనగరమైన లాహోరులో నుండుటయే దేశమునకు మేలని మిత్రులు గురుదత్తప్రభృతులు భావించిరి. వారి బలవంతముచే నాతఁడు లాహోరులో నివాసము పెట్టెను. అక్కడ-చీఫ్ కోర్టులో న్యాయవాదులలో-ప్రథమశ్రేణిలో-ప్రముఖస్థానము వడసెను. దానితోఁ దృప్తి పడక ప్రజాహితకార్యములలో రేయుంబవలు పాల్గొనుచుండును. ఆర్యసమాజకార్యక్రమములో బద్ధశ్రద్ధ చూపును. ఆ సమాజమున కెంతో ధనమావశ్యకమాయె. అహోరాత్రము లా ధనము ప్రోవుచేసి యీ సంస్థలో నడపెడి కార్యకలాపములన్నింటిని జక్కఁగాఁ గొనసాగించుటయే లాలాజీ దినచర్య. ఆర్యసమాజమువారు దయానందకళాశాలనేగాక పంజాబులో నొక యున్నతపాఠ

శాలనుగూడ నెలకొల్పిరి. ఫిరోజిపూరులో - అనాథశరణా లయము స్థాపించిరి. ఇంకొకచోట - కన్యాపాఠశాల నేర్పఱిచిరి. ఇటు లెన్నో సంస్థలను - ఆర్యసమాజముపేర స్థాపించి వానికి వలసిన ధనమును దెచ్చియిచ్చుటకే లాలాజీ యావజ్జీవితము ధారవోసెను.

ఆవల-ఆర్యసమాజములో రెండు తెగ లేర్పడెను. ఒక తెగవారు కేవలము గురుకులమువారు. వారి యాదర్శ మచ్చముగా వైదికోద్ధరణము; బ్రహ్మచర్యవిలసితమైన మత ప్రచారమును. రెండవవారు సంఘసంస్కర్తలు. అధునిక పాశ్చాత్యవిజ్ఞానమూలకమైన సంఘోద్ధరణమే వీరి యాద ర్శము. ఈ యుభయాదర్శముల పక్షమున నాధ్వర్యవము వహించి పని చేసిన మహామహు లిర్వురును మనకుఁ బూజ్యులే. ఒకరు శ్రద్ధానందస్వామి; మఱొకరు లాలా లజపతిరాయి.

దయానందకళాశాలకు హంసరాజ్ - లజపతిరాయు లిర్వురు ప్రాణమువంటివారు. మొదటివ్యక్తి - ఆ కళాశాలలో జీతనాతములు తీసికొనని ప్రధానాచార్యుఁడు. లాలాజీ - ఆఱేండ్లు, ఉపాధ్యక్షుఁడుగా నొక్క 'పుష్కరము' మంత్రిగాఁ బని చేసెను. పైగా-అప్పుడప్పుడు, ఐతిహాసికాధ్యాపకుఁడుగా జీత మాసింపకయే సేవ చేసెను. న్యాయవాదివృత్తి కంత రాయము సంభవించినను వెనుకంజ వేయక కళాశాలా వ్యయమునకై యాతఁడు స్వయముగ నెంతో ధనమిచ్చెను. ప్రభుత్వసహాయ మాశింపక ప్రజలే స్వయముగా నీ సంస్థను గాపాడుకొవలెనని యాతని పట్టుదల. ఆ సహాయమే మనము కోరితిమా విద్యావిషయములో దొరతనము జోక్యము

దొడ్డదై మన స్వాతంత్ర్యమును జంపివేయునని యాతని భావము.

లాలాజీ, జలంధరులో మఱొక సంస్కృతకళాశాలను నిర్వహించుటలోఁ బెత్తనము వహించెను. విద్యావిషయకములైన యాతని కార్యకలాపములు ప్రభుత్వముసైతము మెచ్చుకొనెను. ఒకసారి కర్జన్ ప్రభువు విద్యావిషయమై సమగ్రముగాఁ బరిశీలింపవలెనని యొక 'కమిటీని' నియమించెను. ఆ కమిటీ-సభ్యులు లాలాజీతోఁ బ్రస్తావించి యెన్నో విషయములు సేకరించుకొనిరి. తాను జెప్పినది యాచరణలోఁ జూపు స్వభావము వానిది కావున వారివీరి ధనము ప్రోవు సేయుటయే గాక, తానుగూడ విద్యాసంస్థ కొకతూరి యేఁబదివేల రూప్యములు విరాళముగా నిచ్చెను. అది రెండేండ్లు కోర్టులో గడించిన గడన.

ఉత్తరభారతములో 1896 – 97 సంవత్సరములలోఁ బెద్ద కాటకము దాపరించెను. అప్పు డాఁకటిమంటలకుఁ దాళఁజాలక నకనకలాడు పొట్టలు చేతఁబట్టుకొని వేలకొలఁది కుటుంబములు దేశములోఁ దిరుగఁజొచ్చెను. దిక్కు మొక్కు లేని పిల్లలు సేయు నాక్రందనములకు లెక్క లేదు. ఆ దీనదశ కన్నులారఁ జూచి లాలాజీ యెంతో దుఃఖపడెను. పదపడి గుండె దిటవుచేసికొని క్షామనివారణసంఘములు స్థాపించి రంగములో దూఁకెను. అనాథశిశుపోషణాలయము లెన్నో నెలకొల్పెను. కటువునకు గుఱియైనవారెందఱో మందలుమందలుగా మ్రందవలసిన యా యాపదలో – ఆతఁడు చేసిన సదుపాయములవలన హాయిగా బ్రదికిరి. ఆ

దెబ్బలో దేశము నాలుగేండ్లుగా నవసిపోయెను. అన్నేండ్లు- ఆతఁడు దేశముకోసమై పడ్డపాట్లు చెప్పఁదరము గాదు. ఆ యాపదలో మఱొక 'రోఁకటిపోటు' దాపరించెను. దిక్కు-లేక దీనవదనులైన హైందవబాలుర నెందఱనో యదే యదనులో క్రైస్తవ-మిషనరీలు క్రైస్తవమతములోఁ గలుపు కొనసాగిరి. ఆపదలో నాదుకొందురన్న సాకుతో నెందఱో యభాగ్యులీ పన్నుగడలోఁ బడిపోవఁ జొచ్చిరి. పైగా- ప్రభుత్వమే యా బిడ్డలను బట్టితెచ్చి మిషనరీల కప్పగించు దుర్గతియు దొరలెను. ఈ 'ఘోరకలికి' లాలాజీ దద్దరిల్లెను. పాంచాలకేసరి యని పేరుమోసిన లజపతిరాయి, నిండు పౌరుషముతో రంగములో దూఁకి ప్రచారమునకు దిగెను. అనాథుల నాదరింపని మన బ్రదుకెందులకని హైందవులను మందలించెను. క్రైస్తవుల చేఁతలు క్రేలెత్తి చూపెను. విదేశ ప్రభుత్వము సాగించు పాక్షికభావమును వెలిఁబుచ్చెను. హెచ్చరా హెచ్చరిగఁ జేయు నీ ప్రచారము మూలమున హైందవజాతి మేలుకొనెను. ఎక్కడివా రక్కడ నడుములు బిగియఁగట్టిరి. ఇమ్ముగా సొమ్ము క్రుమ్మరించిరి. ఆహారపదార్థములు ప్రోవుచేసిరి. దీనజనశరణాలయము లుద్ధరించిరి. వేల తరబడిగా మతము మాఱిపోవనున్న హైందవబాలుర కండ దండలు దక్కెను. ఆ దశలో - ఆర్యసమాజమువారు చేసిన సేవ యపారమని చెప్పవచ్చును. లాలాజీ నిరంతరకృషివలన- ఆర్యసమాజమువారి యాధ్వర్యవములో హైందవసంఘ ముద్ధరింపఁబడెను. పంజాబులో రాజస్థానములో - అనాథ శరణాలయ లనేకములు స్థాపించిరి. దిక్కులేని పిల్లల

కక్కుడఁ జక్కఁగాఁ బ్రదుపుతెరువులు చూపిరి. కేవలము పంజాబులో నొక్క శరణాలయములోనే పదునెనిమిది వందల మంది బాలురు - ఉండెడివారఁట. ఫిరోజ్‌పూరు శరణాలయ ములో లాలాజీదే పెత్తనము. తన సోదరిపేర నొక భవ నము కట్టించి యా శరణాలయమున కిచ్చివేసెను. ఈ తీరుగఁ గఅవుకాటకములలో - ఆర్యసమాజకార్యకర్తలను దేశ ములోఁ ద్రిప్పి యాతఁడు చేసిన దేశసేవను యావద్భారత మగ్గించెను. ఈ ఘట్టములో - ప్రభుత్వమే - ఆతని సలహా లకై యెదురుచూచిన రోజులు కలవు.

1905 లో - పంజాబురాష్ట్రములో నాకస్మికముగా భూకంపము సంభవించెను. కొన్ని ప్రాంతము లా యుద్ధవడికి సాంతముగా గుటియయ్యె. ఎందఱో మ్రందిరి. ఎంతో నష్ట మాయె. కష్టముల కంతు లేదు. ఆ దశలో లాలాజీ రేయుంబవలు కృషిచేసెను. స్వయంసేవకులను వెంటవేసి కొని భీతుగొలుపు - ఆ ప్రాంతములకుఁ బోయి మట్టిలోఁ గూరుకొన్న జీవుల నుద్ధరించెను. ఆపదలో నున్నవారి నాదు కొనెను. అప్పటికిఁ బ్రభుత్వసహాయము రానేలేదు. ఇట్లే - ఒరిస్సా - బీహారు - మధ్యపరగణాలలో వచ్చిపడిన మహా పదలోసైతము లక్షలకొలఁది వ్యక్తులను లాలాజీ రక్షించెను.

హైందవజాతిలో నున్న దోషములలో దొడ్డదోసము- అస్పృశ్యత. మానవునకు మానవునకు భేదభావము కల్పించి యెంతో పాతకము కట్టుకొనుటయే గాక సంఘమునకుఁ గూడఁ బెద్ద నష్టము తెచ్చిపెట్టిరి. ఈ రహస్యము మూల ముట్టుగా గుర్తించినవారిలో గాంధిజీ ముఖ్యుఁడని లోక

మెఱుంగును. ఆయన చలువవలననే హరిజనోద్యమము నేఁడు శాఖోపశాఖలుగా దేశములో నెగఁబ్రాఁకి సత్ఫలిత మిచ్చినది. ఈ 'సమస్యను' లాలాజీసైత మెన్నఁడో గ్రహించెను. వేరుపుర్వువంటి యంటరానితనమును గెంటివేయక హైందవజాతికి నున్నతస్థాయి కలిగింపలేమని యాతఁడు భావించెను. హిందూధర్మము నుద్ధరింపవలెనన్న — ఆ సంఘములో నొక భాగమైన — ఆ జాతి నుద్ధరింపవలెను. సంఘముకూడ నొక వ్యక్తివంటిది. అవయవములలో నొక దానికి దెబ్బ తగిలెనేని దేహమున కంతకు బాధయేగదా! వట్టిమాటలు చెప్పి రిక్తహస్తములు చూపినచో — ఈ యత్యాచారము రూపుమాయదు. మొదలంటఁ బెకలింపవలెనన్న — పరోపదేశ పాండిత్యము గాక, ఆచరణములో ధైర్యము సూపవలెను. ఆ ధైర్యము సూపినవారిలో లాలాజీ మొదటివాఁడు.

1912 లోనే లాలాజీ, అస్పృశ్యుల సమావేశము లెన్నో చోట్ల నేర్పఱిచెను. అస్పృశ్య లను మాటయే యంతరింపవలెననియు — ఆ సంఘము హిందూసంఘములో నొక రెక్క యనియు నెన్నో రీతుల నిరూపించెను. ప్రచారమే కాక—ఆ జాతి విద్యాభివృద్ధికై లాలాజీ స్వయముగా నలువది వేలరూప్యములు దానమిచ్చెను. ఆ సొమ్ముతోఁ బెక్కు చోట్ల—ఆ జాతివారికిఁ బాఠశాలలు పెట్టిరి. ఆర్యసమాజము వారు నడపు పాఠశాలలలోసైత మా సంఘమువారిని జేర్చుకొనిరి. గురుకులములలోఁగూడ నీ భేదభావము చూపరు. లాలాజీ, ఆటవికప్రదేశముల కరిగి నిమ్నజాతులని పేరువడ్డ

యనాగరికవర్గమును గలసికొని వారిచ్చు నాతిథ్యమును స్వీకరించును. కలసిమెలసి భుజించును. ఆతని యుద్యమము వలన నిమ్నజాతుల కప్పుడే కొంత మేలు కలిగెనని చెప్ప వచ్చును.

సరిగా, భారతజాతీయమహాసభ - ఆవిర్భవించిన సంవత్సరమందే లాలాజీ న్యాయవాదియై దేశములోనికి వచ్చెను. నాలవమహాసభ - అలహాబాదులో జరిగినది. అప్పటికి లాలాజీ వయస్సు - ఇరువది మూఁడేండ్లు. ఆ యేఁడు లాలాజీ - ఆ మహాసభలోఁ బాల్గొని శాసనసభల విస్తీర్ణతనుగూర్చి జరిగిన వాదోపవాదములలో లెస్సగా జోక్యము తీసికొనెను. దేశాభ్యుదయనిరోధకమార్గములో నడచుచు, కాంగ్రెసునకుఁ బ్రతికక్షియై నిలిచిన 'సయ్యద్ అహమ్మద్ ఖాను' ధోరణిని నిశితముగా విమర్శించెను. నాఁటినుండియు నాతని దృక్పథము - ఒక్క పాంచాలరాష్ట్రమునకే సమన్వయింపక యావజ్జాతీయస్వామ్యముగాఁ బరిణమించెను. కాశీ - కాంగ్రెసులో జాతీయవాదిగా నాతఁ డిచ్చిన మహోపన్యాసమును బెద్దలే ముద్దుముద్దుగఁ గన్నుల కద్దుకొనిరి. బొంబాయిలో జరిగిన కాంగ్రెసుమహాసభలో సీమకు నిర్వురు ప్రతినిధులను బంపవలెనని తీరుమానించిరి. ఆ యిర్వురు, భారత ప్రజలు కోరిన కోరిక లిట్టివని పూస గ్రుచ్చినట్టులు - ఆంగ్లేయులకు నచ్చఁజెప్పవలెనని సభవారి సంకల్పము. ఆ యిర్వురిలో - ఒకరు గోపాలకృష్ణగోఖ్లే; రెండవయతఁడు లాలా లజపతిరాయి. బహుకార్యవ్యాపకమువలన ననారోగ్యము పొడసూపినను లాలాజీ, కాంగ్రెసు - ఆదేశమును గాదనక

సీమకుఁ బ్రయాణమాయెను.

ఇంగ్లాండులో నాతఁడు బ్రహ్మాండమైన సభలు పెట్టి భారతసమస్యలను బాహాటముగాఁ జాటెను. అచ్చటి రాజకీయపక్షములవారి పడిపంచలలోఁ బడి 'భిక్షాం దేహి' గా నాశ్రయించు ధోరణి సరిగాదని యాతని సిద్ధాంతము. మన జాతీయసమస్యలను మన శక్తియుక్తులచే మనమే పరిష్కరించుకోవలెఁగాని లాఁతివారి సహాయసంపదలకై వాచిపోయి వేచియుండరాదని లాలాజీ విశ్వాసము. ఆ ధోరణిలో నాతఁడు లండనులోఁ బ్రచారకాండ సాగించెను. అద్దాన నప్పటికి మూటకట్టినట్టుగా లాభములు వెంట రాకపోయినను భారతీయసమస్య లిట్టివని యా దేశములో బాగుగాఁ దెలిసిపోయెను. కొన్ని వర్గములు - కొందఱు వ్యక్తులు భారతీయుల పట్ల నాదరాభిమానములు సూపుచు నాప్తులై యుండగా నిలిచిరి.

ఆ దెబ్బలో నాతఁడు - ఐరోపాఖండ మంతయుఁ దిరిగివచ్చెను. స్వాతంత్ర్యము చక్కఁగాఁ జవిచూచి హాయిగా మెలఁగుచున్న - ఆ ఖండములోని ప్రజానీకమును గాంచి, భారతీయులకీ దశ యెన్నఁడు పట్టునాయని యాతఁడువ్విళులూరును. అచ్చటి రాచఱికపుఠీవి చూచి తన ప్రజలకుసైత మా మురిపము లెన్నఁడు తీఱునో యని పదింబదిగాఁ దలపోయును. దాస్యమున మ్రగ్గి లాఁతివారిచే దోఁచుకొనఁబడుచున్న భారతీయు లెన్నఁడు - ఈ స్వాతంత్ర్యవాయువులు పీల్తురోయని బెంగపడును. అవల - అమెరికా - సంయుక్తరాష్ట్రములలోఁగూడఁ బర్యటించెను.

అచ్చటి విద్యాసంస్థలను విశ్వవిద్యాలయములను జక్కఁగాఁ బరిశీలించి వానిలోని విశిష్టాంశములను సాంగోపాంగముగ నాకళింతకుఁ దెచ్చుకొనెను. ఒక్క విద్యావిషయములే గాక ప్రపంచసమస్యలను శ్రద్ధగాఁ బరిశీలించి బాఢముగా నవగాహము చేసికొన్న భారతీయుఁడు - ఆ రోజులలో లాలాజీ యొక్కఁడే. రాష్ట్రీయత-జాతీయత-అంతర్జాతీయత సమన్వయ పఱచిన మొదటి భారతజాతీయమహారథుఁడు లాలాజీ. తాను గడించిన యనుభవమును దేశమునకై యనుక్షణము వినియోగించిన మహాత్యాగి లాలాజీ. గోపాలకృష్ణగోఖ్లేతో పాటు విదేశములనుండి తిరిగివచ్చినపిదప లాలాజీకి భారతదేశములో నగ్రిమస్థానమే దక్కినది. విదేశప్రయాణ వ్యయమునకై యెవ్వరో యిచ్చిన మూఁడువేలరూప్యములను దయానందకళాశాలకు - పంజాబురాజకీయప్రచారసంఘమునకుఁ జెరి సగముగాఁ బంచి యిచ్చెను.

లాలాజీ స్వదేశములోఁ గాలువెట్టి కలయఁజూడఁగా రాజకీయసంక్షోభ మెల్లయెడలఁ దాండవించుచుండెను. కర్జను ప్రభువు చేసిన వంగదేశవిభజనము మూలమున - ఒకానొక మహోద్యమము యావద్భారతములోఁ జెలరేఁగెను. ఆ యెద్దడిలో బాహాటముగా జరిగిన విదేశ్యవస్తుబహిష్కరణ సందర్భములో లాలాజీ గోఖ్లేతోఁ గలిసి హోరాహోరిగఁ బ్రచారము చేసెను. కాశీనగరములో జరిగిన కాంగ్రెసు మహాసభలో వంగవిభజనముగూర్చి లాలాజీ చెప్పిన మాటలు చేసిన విమర్శనము ప్రభుత్వమునకు గుండెబెదరు పుట్టించెను. ఆ దెబ్బలో దేశసేవకుల నెందఱనో చెఱసాలలోఁ ద్రోసి

వైచిరి. నిర్బంధములు పెరిఁగినకొలఁదియు స్వాతంత్ర్యోద్యమము శాఖోపశాఖలుగ వర్ధిల్లెను. అంతలంతలు చేసిన ప్రభుత్వ మది చాలదన్నట్టు - పంజాబుపరగణాలోఁ బొలము సిస్తు - నీటితీరువ పెంచివైచిరి. గాయములోఁ గారము కూరినట్టులు దేశములో బాధలు పెరిఁగిపోయెను. ప్రభుత్వవిధానమునుగూర్చి కొంచెము కటుకుగా 'పంజాబీ' పత్రిక ఘోషవెట్టెను. అదే తరుణములో నొక చిన్నఘట్టము దాపరించెను. పోలీసుసూపరెంటెండెంటు - ఒకఁడు, ఒకనాఁటి వేఁటలో నొక పందిని జంపెను. దానిని బంగళాకుఁ దెమ్మని సేవకుని కాజ్ఞ యిచ్చెను. ఆ సేవకుఁడు మహమ్మదీయుఁడు. మతధర్మప్రకార మాతఁ డా పంది నంటుకొనుటకే సమ్మతింపఁడాయె. దానికిఁ గోపము వచ్చి వెంటనే - ఆ పోలీసు దొర, ఆ నౌకరును గాల్చివైచెను. ఈ సంఘటననుగూర్చి విచారణ సేయవలసినయక్కఱ కలదనియు - ఆంగ్లేయుల దృష్టిలో న్యాయమని తోఁచినంతవఱకే - ఆ యభాగ్యుని ప్రాణములకు మూల్య మీయవలసియుండుననియు 'పంజాబీ' పత్రిక ప్రకటించెను. దానికి నధిపతి లాలా జస్వంతరాయి. సంపాదకుఁడు కాశీకృష్ణ అథావలే. వా రిర్వురు - ఆ పత్రికలో నాతీరుగఁ బ్రకటించుటచే జాతిద్రోహము చేసినట్టులుగా నేరమి యారోపించి ప్రభుత్వము, విచారణ పెట్టకయే వారి కాఱునెలలు శిక్ష విధించిరి. పంజాబు హైకోర్టుసైతము దానినే బలపఱిచెను.

పంజాబీపత్రికపయి జరిగిన యీ యత్యాచార ఘట్టము లాలాజీ హృదయమునకు సమ్మెటపెట్టుగాఁ

దోఁచెను. ప్రజలలో నుద్రేకము పెచ్చుపెరిఁగెను. ఆదెబ్బలో సర్దారు-అజితసింగు లాలాజీ కలిసి దేశములోఁ బ్రచారము చేసిరి. ప్రభుత్వవిధానమును గూర్చి పదింబదిగాఁ బ్రజలకు బోధించిరి. గోరుచుట్టుపై రోఁకటిపోటన్నట్టులు దేశములో విషమసమస్యలు తాండవించుచుండఁగా నింతకు నీ యాందోళన కంతకు లాలాజీయే కారణ మనియు నతఁ డొక పెద్ద విప్లవకారుఁడనియుఁ గొన్ని పత్రికలు ఘోషవెట్టెను. అది యాధారముగాఁ జేసికొని పంజాబు ప్రభుత్వము విచారణ మాటయే యెత్తక వారిర్వురకుఁ బ్రవాసశిక్ష ప్రసాదించెను.

ఒకనాఁడు లాలాజీ హైకోర్టునకుఁ బోవుచుండెను. దారిలో నిర్వురు పోలీసు - ఇన్స్పెక్టరులు, ఆతఁ డెక్కిన బండిలోనే యెక్కిరి. అప్పుడే జిల్లా సూపరెంటెండెంటు సైతము వారిని గలసికొనెను. ఆ ముగ్వురు లాలాజీతో-అయ్యా, మీతో డెప్యూటీకమీషనరు కొన్ని నిమిషములు కలిసికొని మాటాడఁగోరి రని చెప్పిరి. సరే యని యాతఁడు వారితో వానివద్దకుఁ బోయెను. అక్కడ- ఆ పైయుద్యోగి, గవర్నరుజనరలు వేసిన 'ఆర్డరు' లాలాజీకిఁ జూపెను. అది -ఆతని నీ దేశమునుండి వెడలఁగొట్టవలెనని చెప్పిన శాసనము. ఆ శాసన మెన్నఁడో బూజువట్టిపోయిన ప్రాఁతచట్టమునుండి యుద్ధరించినది. 'ఫ్రాంసు'లో నట్టి తుచ్ఛమైన శాసనము రద్దుచేసియుండఁగా నీ దేశములో దానిని బదిలముగా లాఁతిప్రభుత్వము ప్రవేశపెట్టెను.

ఆ శాసనమునుబట్టి యప్పుడే లాలాజీకి - 'ప్రవాసము' ప్రారంభమాయె. రక్షకభటుల కాపుదలలో నాతఁడు పోవు

చుండెను. ఇంటి మంచిసెబ్బరలు చూచుకొనవయ్యా యని పెద్దపిల్లవాని పేర దారిలోనే యుత్తరము వ్రాసెను. కాని, దాని నెప్పుడో ప్రభుత్వ మా కుఱ్ఱవాని కందించెను. న్యాయవాదివృత్తికిఁ జెందిన సర్వవిషయములనుగూర్చి మిత్రుఁడైన న్యాయవాది కొకనికి నుత్తరము వ్రాసెను. దారిలో నాతనికి వ్యవధిమాత్రమే యిచ్చి యా రాత్రియే వానిని 'డైమండ్ హార్బరు' చేర్చిరి. ఆవల నావలో రంగూను పంపిరి. అక్కడ నుండి రైలులో మాండలేకుఁ బ్రయాణము. సరిగా నాతఁడచ్చటికి వచ్చువేళకు స్టేషనులో నొక్క పురుగు లేదు. ఒక్క వ్యక్తిమాత్రమే త్వరగా వచ్చి యాతని కాళ్లకు భక్తితో మ్రొక్కెను. ఆతని పేరు 'దేవఘుర్.' అతఁడు భారత సేవకసమితిసభ్యుఁడు. వెంటనే యధికారి వారి నిర్వురను వేఱుపఱిచి లాలాజీ చేతిని గట్టిగాఁ బట్టుకొనెను. ఆ పరిస్థితిలో లాలాజీ యా వ్యక్తికిఁ జేయెత్తి ప్రతినమస్కారము చేయను వీలులేక పోయెను. శిరఃకంపముమాత్రము చేసెను.

మాండలేజైలులో లాలాజీపై గట్టి కాపుదల పెట్టిరి. ఆతని నెవ్వరును గలసికొనరాదు; మాటాడరాదు. ఆతని చిన్నతమ్ముఁడు ఘనపతిరాయి, యన్నగారిని జూడవలెనని వందలు కర్చుపెట్టి మాండలేకు వెళ్ళియు వ్యర్థముగాఁ దిరిగి రావలసివచ్చెను. జైలులో నాతనికి వార్తాపత్రికలన్నవి దగ్గఱకే రానీయరు. ఏవో కొన్ని యింగ్లీషుపుస్తకములు మాత్రము చేతి కిత్తురు. ఆతని యుత్తరములు చాలవఱకుఁ ద్రొక్కిపెట్టుటయే రివాజయ్యెను.

లాలాజీని దేశమునుండి తీసికొనిపోయిరన్న దుర్వార్త

దేశములో నాలుగువైపులఁ బొక్కిపోయెను. కొందఱు కంటనీరు పెట్టిరి. పత్రికలలో వ్యాసములు ఘోషపెట్టెను. నాయకులు మహానాయకులు నాందోళన చేసిరి. గోపాల కృష్ణగోఖ్లే శాసనసభలో నీ విషయమై యెత్తుకొని హృదయ విదారకమైన మాటలలోఁ దన దుఃఖమును వెల్లడించెను. నిష్కారణముగా లాలాజీని బ్రవాసమునకుఁ బంపిరని భారత మంత్రికి విన్నవించుకొనెను. ఎన్ని చెప్పినను - ఏమి చేసినను - అప్పటి కాలకించు నాథుఁడే లేఁడయ్యె. తుద కాఱు మాసములకు - ఇండియాప్రభుత్వము తాను జేసిన తప్పిదమును గుఱుతించి లాలాజీ స్వదేశము రావచ్చునని యాజ్ఞ యిచ్చెను. సర్దారు - అజితసింగునుసైతము లాలాజీతోపాటు మాండలేజైలులోనే యుంచినను-ఆ యిరువుర కా వార్తయే బొత్తిగాఁ దెలియనీయరైరి. ఆ ప్రాంతములో వారెన్నఁడు కలసికొన్నది లేదు. లాహోరు చేరువఱకు విడుదలవార్త యెవ్వరికిఁ జెప్పరాదను షరతుతో - ఒకనాఁడు వారి నిర్వురను విడిచిపెట్టిరి. ఇరువురు నొకే బండిలో రంగూను చేరిరి. ఓడలో వేఱువేఱుగాఁ బ్రయాణము చేసిరి. లాహోరు చేరినతరువాతనే యా వార్త దేశములోఁ దెలిసి పోయెను.

ప్రవాసమునుండి మాతృదేశమునకు వచ్చిన లాలాజీ దివ్యమూర్తి, పుటము వెట్టిన బంగారమై వెలుఁగులు గ్రమ్మరించెను. ఆనందోత్సాహములు వెల్లివిరిసి ప్రజ లెందఱో యాతనికి ఘనమైన స్వాగత మిచ్చిరి. సేతువుఁదొట్టి శీత నగముదాఁక నాతని యశశ్చంద్రిక లద్భుతముగా వ్యాప్తి

చెందెను. ఆ ఘట్టములో యావద్భారతములో జాతీయోద్యమములోఁ బ్రత్యేకముగా మువ్వురు మూర్తులు త్రిమూర్తులై ప్రవర్తిల్లిరి. వారినే బాల్-లాల్-పాల్, అని లోకము బహూకరించెను. ఒకరు లోకమాన్యులు బాలగంగాధరులు; ఇంకొకరు పాంచాల కేసరి లాలా లజపతిరాయి. మఱొకరు మహావక్త బిపినచంద్రపాలు. వీరిలో స్వదేశీయోద్యమమును జాతీయవిద్యావిధానమును బహుళముగాఁ బ్రచారము చేసినది లాలాజీ.

మాండలేనుండి వచ్చినపిదప లాలాజీ రెండువారములు విశ్రాంతి తీసికొనెను. ఆవల దేశములోఁ దిరిగి ప్రచారము చేసెను. తనపైఁ బత్రికలు కొన్ని యారోపించిన నేరముల నక్షరాక్షరముగ ఖండించి పిండితార్థము తేల్చెను. కలకత్తా – లండనులలోని కొన్ని పత్రికలపై 'దావా' లు వేసెను. అందొకటి క్షమాభిక్ష వేఁడెను. కొన్ని యోటమి వొంది లోకమునకు నిజము చెప్పుకొన్నవి. ఈ వ్యవహారములో సొమ్ము మిక్కిలిగా నలిగినను ప్రభుత్వము తత్వము గుర్తించునట్లులు – తప్పిద మెవ్వరిదో తెలియునట్లులు – ఆతఁడు చేయఁగలిగెను.

కాంగ్రెసు చరిత్రలో సూరత్ కాంగ్రెసుమహాసభ విచిత్రమై విశిష్టమై పరగినది. ఆ యేఁడు నాగపూరులో జరుగవలసిన యీ మహాసభ లాలాజీ స్వదేశాగమనమును బురస్కరించుకొని సూరత్ నగరమునకు మార్చివైచిరి. అతివాదులయు మితవాదులయు నభిప్రాయభేదములవలన నధ్యక్షుని నెన్నుకొనుటలోనే యంతరాయము దాపరించెను. అతి

వాదులు తీవ్ర ప్రయత్నములు చేసి లాలాజీ నధ్యక్షునిగా నిర్ణయింపఁగోరిరి. మితవాదులు రాసవిహారఘోషును నిశ్చయించిరి. ఈ ఘట్టములో లాలాజీ జోక్యము తీసికొని ఘోషునే యధ్యక్షునిగా నెన్నుకోవలెనని పత్రికలలోఁ బ్రకటించెను. ఆ రెండువర్గములకు సామరస్యము సమకూర్చి జాతీయసంస్థను బ్రోదిసేయవలెనని యాతఁ డెంతో పాటుపడెను. యావచ్ఛక్తిని వ్యయపెట్టి విశ్వప్రయత్నము చేసినను - కాంగ్రెసులోఁ గుమ్ములాటలు కూలిపోవవయ్యె. దానికి లాలాజీ విసిగి వేసారి కొన్నేండ్లు - ఆ సంస్థనుండి వైదొలఁగి యుదాసీనభావము పూని దేశహితకార్యములలో నేమఱక సమాజసేవ చేయుచుండెను. కాని, ప్రభుత్వము గూఢచారులు వెంటఁబడి వేధించి వేఁటాడుటవలన విసివి విసివి కొన్నేండ్లు విదేశములలోఁ గాలము గడపెను.

రాజకీయపుబాధ లీ విధముగా నుండఁగా లండనులోఁ జదువుచున్న పుత్త్రునకు జబ్బుచేసెనని వార్తవచ్చెను. తానే వెళ్ళి యా బిడ్డ నీ దేశమునకుఁ దీసికొని వచ్చెను. ఎన్నో మందులు మ్రాఁకులు వాడిరి. ఎందఱో ఘనవైద్యులు పని చేసిరి. కాని యా బిడ్డ యాతనికి దక్కలేదు. ఛిద్రములందే యనర్థము లనంతములన్నట్లు కొన్నాళ్ళ కల్లుఁడుసైతము కాలము చేసెను. పిడుగు పడినపడువున నడుములు క్రుంగిపోయినను మేరుధీరుఁడగు లాలాజీ తెప్పిఱిల్లి యథాపూర్వముగ దేశసేవలో మునిఁగిపోయెను.

**1913**-లో గాంధిజీ, 'దక్షిణాఫ్రికా'లో భారతీయుల యిక్కట్లు తొలఁగించుటకు 'సత్యాగ్రహము' సాగించెను.

ఆ యుద్యమము వార్తలు హైందవములోఁ బొక్కిపోయెను. దాని పూర్వాపరములు వివరించుచు భారతీయు లందఱీ యుద్యమములోఁ జేయూఁత నీయవలయునని గోపాలకృష్ణ గోఖ్లే యావద్దేశమునకు విన్నవించెను. విన్నపము విన్నదే తడవుగ దేశీయు లెందఱో సహాయసంపత్తులతో ముందునకు వచ్చిరి. పంజాబులో లాలాజీసైత మీ యుద్యమముపట్ల మిక్కిలి మక్కువపడి పదివేలరూప్యములు పంపెదనని ప్రకటించెను. మీఁరుగా-ఈ ప్రాంతము రాఁగలరేని యీ తరుణములో నిరువదివేలరూప్యములు వసూలుసేయఁగలనని గోఖ్లే పేర లాలాజీ యుత్తరము వ్రాసెను. అప్పుడు గోఖ్లే జబ్బుపడి యుండియు లాలాజీమాటమీఁది యభిమానమునుబట్టి పంజాబు వెళ్లెను. ఆయన నాహ్వానింపవలెనని యంత పట్టుదల యెందులకని యెవ్వరో మిత్రులు లాలాజీ నడిగిరఁట. అయ్యో! వారిని మన యింటికి నాహ్వానించుటలో నింతకన్న మంచితరుణ మెన్నఁడు దొరకదని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. గోఖ్లే స్వయముగా వచ్చుటఁజేసి లాలాజీ జోక్యము తీసికొని యిరువదివేలకు బదులుగా నలువదివేలు పంజాబు నుండి యిప్పించెను. అతివాదులలో నగ్రేసరుఁడైన లాలాజీ మితవాదులలో మిన్నయైన గోపాలకృష్ణగోఖ్లేను – ఈతీరుగ గౌరవించుటఁజేసి లాలాజీ యుదారభావము విశాల హృదయము వెల్లడియగుచున్నది. మంచి యున్నచో మన్నించుట మహనీయుల మార్గముకాదా మఱి!

ఆ యేఁడే కరాచీ 'కాంగ్రెసు' మహాసభకు లాలాజీ కూడ వెళ్లెను. ఆ సమావేశములో సీమ కొక రాయబారము

పంపవలెనని తీరుమానించిరి. వలసపోయిన భారతీయుల విషయమై వ్యవహరింపవలసిన పద్ధతులు - 'ప్రెస్‌యాక్టు'కుఁ జెందిన వింతలు విశేషములు - 'ఇండియన్ కౌన్సిలు'ను బాటు నకుఁ దెచ్చు మార్గములు - న్యాయపరిపాలనాశాఖలను వేఱుపఱుచు విధానము మున్నగువానినిగూర్చి సీమలోని యధికారివర్గమునకు రాయబారమువారు నచ్చచెప్పవలసినదని నిర్ణయించిరి. జిన్నా - సింహా - బి. యన్. శర్మ - లాలాజీ వంటి దిగ్గంతులను రాయబారము సభ్యులుగా నెన్నుకొనిరి. 'కాంగ్రెసు' నియమించినట్లు - ఆ రాయబారమువారు సీమ కేఁగి తమ విధ్యుక్తము నెఱవేర్చి యిండ్లకు మఱలి వచ్చిరి. వారిలో లాలాజీమాత్రము కొన్నాళ్లు సీమలోనే కాలము గడపి యావల జపాను వెళ్లెను. జపానులోఁ గొన్నాళ్లు నిలిచి యింటికి రావలె ననుకొనుచుండఁగా ఘోరమైన 'యూరపు' సమరము దాపరించెను. ఆ యెద్దడిలో భారతప్రభుత్వ మాతనిని స్వదేశమునకు రానీయలేదు. తప్పనిసరియై చాలఁ గాలము లాలాజీ - అమెరికాలో మకాము పెట్టవలసివచ్చెను.

తాము - అవలంబించు ధర్మము, కావించు న్యాయ ప్రచారము సర్వజనశిరోధార్యములుగా - ప్రపంచ మామోదింపవలెనని యాంగ్లేయుల భావము. శాశ్వతముగా భారత దేశము దాస్యములో బ్రదుకుటకు, భారతీయులనఁగా నిరాదరణము నుపేక్షాభావము నిరంతరముగా నుద్భవించుటకు నాంగ్లేయు లెన్నో వ్యూహములు పన్ని పరిపాలించిరి. ప్రపంచములోని నాగరికదేశము లన్నిటను భారతదేశమును గూర్చి యక్రమమైన యీ ప్రచారమే చేయుట వాండ్రకుఁ

బరిపాటియై పోయెను. ఈ 'ఘోరకలికి' లాలాజీ సహింపఁ డాయె. అమెరికాలో నున్నంతకాలము భారతీయపక్షమున నిలిచి యాతఁడు చేయవలసిన ప్రచారము చేసెను. భారత దేశస్వాతంత్ర్యఘట్టములో-ప్రపంచము చక్కఁగా నర్థము చేసికొని యాదరాభిమానములు చూపుటకనువుగా లాలాజీ యెన్నో వ్యాసములు వ్రాసెను. ఉపన్యాసము లిచ్చెను. పుస్తకములు ప్రకటించెను. ఆ దేశములో మొమ్మొదట నాతఁ డార్థికముగాఁ గష్టపడవలసివచ్చెను. వ్యాసములు వ్రాసి యిమ్మన్న పత్రికయే యాతనికిఁ గానరాదయ్యె. కాని, 'తరుణభారత' మను పుస్తకమును వ్రాసి ప్రకటించిన వెంటనే లాలాజీ విఖ్యాతి సీమలో నలుమొగలఁ బ్రాఁకి పోయెను. బ్రిటీషుపార్లమెంటులో - ప్రతిసభ్యునకు నీ గ్రంథము బహూకృతి చేసెను. ఇండియాధొరతన మీ గ్రంథమును నిషేధించి యొక్క ప్రతిసైత మీ దేశము రారాదని గట్టిగ నాఁకట్టిరి. అమెరికా మున్నగు విదేశములలో నీ పుస్తక మెన్నో ప్రతు లచ్చువేసిరి. ఈ 'రచనను' బట్టి యాతని పేరు ప్రతిష్ఠలు పెరుఁగుటయే కాక - అమెరికాపత్రికలెన్నో యాతని వ్యాసము లందుకొని యానందముగాఁ బ్రకటించు కొనెను. ఆ వ్యాసముల మూలమున-ఆర్థికమాంద్యము మంద గించి యాతని చేతిలోనికి ధనము పుష్కలముగా వచ్చి పడెను. సామ్యవాదసమాజములు - మజ్‌దూర్‌సంఘములు - విశ్వవిద్యాలయములు మున్నగు సంస్థ లెన్నో లాలాజీని రప్పించుకొని యుపన్యాసము లిప్పించుకొనెను. ఆతఁడు వ్రాసిన వ్యాసములవలనఁ జేసిన యుపన్యాసముల మూలమున-

అమెరికాలో భారతదేశమును గూర్చి యొకానొక సద్భావమే కాక నవ్యచైతన్యముసైతము పుట్టుకొనివచ్చెను.

అమెరికాలో భారతదేశపక్షమునఁ బ్రచారము సేయుటకై లాలాజీ యొక సంఘమును స్థాపించెను. దాని పేరు - ఇండియన్ హోమ్‌రూల్ లీగు. ఆ ఘట్టములో డాక్టరు కేశవదేవశాస్త్రి, డాక్టరు హార్డికర్, లాలాజీకి సహాయకారులై నిలిచిరి. ఆ సంస్థకు హార్డికరు మంత్రి; లాలాజీ యధ్యక్షుఁడు. ఆర్థికపరిస్థితు లంతగా సంతన లేకపోయినను దాని కార్యక్రమములో నేమఱుపాటు లేక లాలాజీ దీక్షగాఁ బనిచేసెను. సొమ్ము చేతిలో లేని పరిస్థితిలో విదేశములలో నాతఁ డెంతో యిబ్బందిపడుచున్నాఁడని యొకసారి లోకమాన్యునకుఁ దెలిసెనఁట. వెంటనే యాయన జోక్యము తీసికొని పదునేడువేలరూప్యము లీ దేశములోఁ బ్రోవుచేసి లాలాజీకిఁ బంపెను. ఆపదలో నాదుకొన్న యా సహాయమున కాతఁ డెంతో సంతోషపడి యా సొమ్మును జక్కఁగాఁ బొదుపుగా - ఆ సంస్థకు వినియోగించెను. దాని వలన నా సంస్థ యేపుగాఁ బెరిఁగి ఫలిత మిచ్చెను. దానిలో సభ్యులు వేలకొలఁదిగాఁ జేరిరి. ప్రచారము సేయుటకై 'యంగిండియా' యనుపేర మాసపత్రికనుసైతము వెలువఱిచెను. ఆతఁడు వ్రాసిన గ్రంథములలో 'తరుణభారతమే' కాక విదేశములలోఁ బ్రచారకార్యక్రమమున కెంతో సాయపడినవి మఱికొన్ని కలవు. వానిలో

'భారత్ కా ఇంగ్లండ్ పర్ ఋణ్'
'టుకడోం కేలియే లడాయీ'

'తరుణ భారత్ కా ఆహ్వాన్'
'భారత్ కేలియే స్వాత్మనిర్ణయ'
భారత్ కా రాజనైతిక్ భవిష్య'

అన్నవి ముఖ్యములు.

ప్రపంచములో నోరు గల దేశములవారు కొందఱు ప్రజలకుఁ దామే ధర్మకర్తల మనియు వాండ్రకు వివేకము పుట్టించుటకే తా మహోరాత్రములు దీక్ష వహింతు మనియుఁ బ్రగల్భములు గొట్టుచు గొఱ్ఱెలలోఁ దోడేళ్లవలెఁ గఱ్ఱపెత్తనమునకు దిగెదరు. అట్టి దేశముల యాక్రమణకు ఁగ్గి దాస్యబంధమునకు లొగ్గి రవ్వంతేని యెదుగుఁబొదుగు లేని చిన్నచిన్న దేశముల విషయమై 'విచారణ' జరిపింపవలె నని యొకతూరి లాలాజీ యమెరికాలో వైదేశికసమితిదృష్టికి విజ్ఞప్తి పంపెను. 'భారత్ ఏక్ శ్మశానభూమి' యన్న శీర్షికతో నున్న యా విజ్ఞప్తిని, ఇంగ్లండ్ - ఫ్రాన్స - ఇటలీ - స్పైన్ - జర్మనీ - రూసు - భారతదేశము మున్నగునవి తమతమ భాషలలో ననువదించుకొన్నవి. అది చూచి భారత దేశవిషయమై ప్రపంచమే యాశ్చర్యపడి ముక్కున వ్రేలు వైచికొనెను. సాంగోపాంగముగ దాని కష్టసుఖము లర్థము చేసికొనెను.

అమెరికాలో నివసించుచున్న భారతీయులైన రైతు లను లాలాజీ యొకచోట సమావేశపఱిచి 'మజ్దూర్ సంఘము' స్థాపించెను. వారు చదువులు చక్కఁగాఁ జదివి దాని ఫలితము లెస్సగా గుర్తించి మంచి జీవితములో రాణించుటకు వీలగు త్రోవలో రాత్రి పాఠశాలలు నడపెను.

ప్రపంచప్రథమమహాసంగ్రామము సంభవించిన రోజులలో - ఆంగ్లేయులకు సంపూర్ణసహాయమే చేయవలెనని భారతనాయకులు నిర్ణయించిరి. ఆపదలో వారి నాదుకొని యావల వారివలన మేలు పొందవచ్చునని గాంధిజీసైతము రంగములోనికి దిగెను. దిగి, దేశములో నిమ్మగా సొమ్ము ప్రోవుచేసి యుద్ధమున కర్పించెను. భారతీయులు తమ శౌర్య స్థైర్యములు చూపను మంచి యవకాశము వచ్చెనని లాలాజీ కూడ సంబరపడి యాంగ్లేయుల పక్షమున నిలిచి పోరాడుట కంగీకరించెను. ఎందఱో సంపన్ను లెంతో సంపదను యుద్ధమునకుఁ బంచి యిచ్చిరి. లక్షలతరబడిగా భారతీయవీరులు విదేశములలో నిలిచి వేడివేడి నెత్తురులు ధారవోసిరి. యావద్భారతము చేయవలసిన సాయ మగ్గలముగాఁ జేయఁగాఁ జూపవలసిన త్యాగము చూపఁగా - ఆ మహాయుద్ధములో నాంగ్లేయులే విజయము పొందిరి. స్తిమితము చిక్కిన వెనుక మా దేశముమాట యేమని భారతీయులు ప్రశ్నించిరి. ఫలితము లేదు; రిక్తహస్తములు, శూన్యహృదయములు. పైగా-నేరములు మోపి 'రౌలట్ చట్టము' వంటి దారుణ శాసనము లడ్డగోలుగఁ దిరుగఁదోడి విదేశప్రభుత్వ మీ దేశములోఁ జెలరేఁగెను. 'జలియన్‌వాలాబాగు' హత్యలఁ బోలువానిని బ్రసాదించెను. దేశములో వికలాంగులకు లెక్కలేదు. తండ్రులు పోయినవారు తనయులు కూలినవారు భర్తలు గతించినవారు దేశమున లెక్కకు మిక్కిలిగఁ దేలిరి. దారిద్ర్య మెల్లయెడలఁ దాండవించెను. కాటకములు గాటకముగఁ జెలరేఁగెను. విదేశములలో నుండవలసివచ్చిన లాలాజీవంటి పెద్దలు స్వదేశములోని తన జనము క్షామ

క్షోభములకు బలియై పొలియుచున్నను వారికి రవ్వంత సాయము చేయుటకైన నవకాశమే లేకపోయెను. అప్పుడు లాలాజీ, గాంధిజీ ప్రకటించు 'యంగిండియా'లో నిట్లని యొక వ్యాసము వ్రాసెను:-

'వెంటనే యింటికి దూఁకవలెనని యెంతో యుబలాట మున్నను భారతమంత్రి యాటంకముచే ఱెక్కలు విఱిగిన పిట్టగా నైతిని. నేఁడు యావద్భారతము భయంకర దరిద్రదేవతావదనగహ్వరమున నిలిచి దీనాతిదీనముగఁ గానవచ్చుచున్నది. ఈ కడచిన యిరువది యైదేండ్లలో క్షామపీడితప్రాంతములలో నాకుఁ జేతనయిన సాయము చేయఁగలిగితిని. ముమ్మరముగా దాపరించిన యిప్పటి యీ ముప్పులో నా దేశమునకు నేను లవలేశమేని సాయము చేయ నయితి కాదే యని మిక్కిలియు వగచుచున్నాను. నన్ను నా దేశమునకు రానీయకపోవుటలో నా యపరాధ మేమియు లేదని నా యంతరాత్మకు తెన్నుగాఁ దెలియును గాన - ఆ విషయములో నొకవిధమైన సంతృప్తి నాకుఁ గలదు. భారతస్వాతంత్ర్యమహాబాధ్యమమును ప్రపంచ మాదరించి మన్నించునట్లు చేయవలసిన 'బాధ్యత' మన కెంతో కలదు. కాని, నిజము చూడఁగా మన మంచిసెబ్బరలకు మనమే పూఁటకాఁపులమై యుండి రేయుంబవలు పని సేయవలసిన యక్కఱ కలదు. ఎవ్వరో వచ్చి యేదో మొఱఁగఁబెట్టెదరని నోరు తెఱచి కూరుచుండరాదు. భారతీయులు తమకుఁ దామే స్వరాజ్యము సాధించుకోవలెను. దానికై యష్టకష్టములు పడనీ ; అమిత నష్టములు

అయిదేండ్లు కడచిన పిదప లాలాజీపై నిర్బంధము తీసివేసిరి. వెంటనే యాతఁడు స్వదేశమునకుఁ బైనమాయె. న్యూయార్కులో నాతని మిత్రులు పెద్ద విందు చేసి మిక్కిలిగా సత్కరించిరి. ఆ విందులో - అమెరికాలో సుప్రసిద్ధులైన రాజనీతివేత్తలు-పత్రికాసంపాదకులు - పెద్దలును బలువురు పాల్గొనిరి. అందఱును లాలాజీ దేశసేవాదీక్షను బాండిత్యప్రకర్షను బెద్దగాఁ గొనియాడిరి. సరిగా, 1920 ఫిబ్రవరి యిరువదియవ తేదిని లాలాజీ బొంబాయిలో దిగెను. ఆ నాఁడు బొంబాయిపట్టణము ఘనమైన స్వాగత మిచ్చి యాతని నెంతో గౌరవించెను.

ఆ యేఁడే బొంబాయిలో జరిగిన మొదటి 'భారత - ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు -' ఆతని నధ్యక్షునిగా నెన్నుకొనెను. ఆ సమయములో నాతఁడు ప్రజానీకమును మేలుకొలిపి కార్మికోద్యమమువంకకుఁ జక్కఁగ నడపించెను. కలకత్తాలో జరిగిన కాంగ్రెసు - ప్రత్యేకమహాసభకుసైతమా యేఁడు లాలాజీ - అధ్యక్షుఁ డాయె. అప్పుడే గాంధిజీ ప్రభావము దేశములో ముద్రితమైపోయె. న్యాయస్థానములు విడనాడుట-పాఠశాలలు బహిష్కరించుట యిట్టివి గాంధిజీ కార్యక్రమములో నప్పుడు ముఖ్యములయ్యె. ఆ త్రోవ లాలాజీకి సమ్మతము కాలేదు. దానిచే నా యుద్యమమునకు దూరముగా నుండి, మాలవ్యా - మూంజీవంటి పెద్దలతోఁ జేతులు కలిపి జాతీయపక్షమును నిర్మించెను. ఆ పక్షము ఢిల్లీశాసనసభలోఁ బ్రవేశించి యద్భుతమైన శక్తిని లోకమునకుఁ జూపెను. శాసనసభారంగములో లాలాజీ ప్రముఖపాత్ర వహించి మిక్కిలిగా రాణించెను.

గాంధిజీ యుద్యమములో మేలైనవని తనకుఁ దోఁచిన మంచిసూత్రములను లాలాజీ పంజాబులో నాచరణకుఁ దెచ్చెను. ఆ ప్రచారము ముమ్మరముగా సాగి దొరతనమునకు బెదరు కలిగించెను. అప్పుడు ప్రభుత్వ మాతనిని లాహోరులోఁ బట్టి పదునెనిమిది నెలలు శిక్ష విధించిరి. చెఱసాలలో నాతని యారోగ్యము సన్నగిల్లెను. క్షయ వ్యాధి సంక్రమించెను. బ్రదికి బయటఁబడుదునన్న యాశయే లేకపోయెను. అట్టి దురవస్థలోఁ బ్రజల యాందోళనకుఁ దాళలేక యాతనిని దొరతనము విడిచిపెట్టెను. వెంటనే యాతఁడు పర్వతప్రాంతములకుఁ బోయి విశ్రాంతి పొంది కొంత తెప్పిఱిల్లెను.

అసహాయోద్యమ కార్యక్రమము సక్రమముగా నిర్వహింపను లాలాజీ, రెండు సంస్థలు స్థాపించెను. ఒకటి – తిలక్ రాజనీతివిద్యాలయము. దానిలో యువజనమునకుఁ జక్కఁగా రాజనీతిని బోధించి వారిని వృద్ధికిఁ దీసికొని వచ్చుట ప్రధానసూత్రము. ఆ సంస్థకై యాతఁడు నలువది వేలరూప్యముల విలువ సేయు తన గ్రంథభాండాగారమును లక్షయేఁబదివేలు వెలసేయు తన దివ్యభవనమును దానము చేసెను. రెండవసంస్థ 'లోకసేవకసంస్థ'. భేదభావములు పూర్తిగ మాని సమస్తభారతప్రజలకుఁ జక్కఁగా సేవ చేయుటయే దాని పరమార్థము. లాలాజీ నెలకొల్పిన యీ సంస్థవలన దేశములో నేఁటికిని సత్ఫలితము దక్కుచున్నది.

బాపూజీ ప్రారంభించిన-అసహాయోద్యమము దేశకాలములనుబట్టి కొన్నాళ్లు కొంతవట్టు 'మందకొడి'గాఁ గానవచ్చెను. ఆ దశలో దేశములో సాంఘికముగా జవసత్వ

ములు కలిగి విశ్వవ్యాపకమైన జాతీయతాధోరణి యుద్భ విల్లవలెనని లాలాజీ మక్కువపడెను. మాళవ్యా - శ్రద్ధానందుల సహకారముతో సాంఘికముగా నైక్యము - పారిశుధ్యము కావించు నుద్యమమును లాలాజీ ప్రారంభించెను. హైందవులయ్యు మతము పుచ్చుకొన్న వేలకొలఁది మానవులను మఱల హైందవములోఁ గలిపెను. హైందవములో నంటరానితనమును గెంటివేయవలెనని యాతని తీర్పు. కుల భేదములు కూలిపోవలెనని యాతని సిద్ధాంతము. జాతిలో నొక చెక్కను - అస్పృశ్యమని పేరు పెట్టి యెందాఁక దానిని వెలిగా నుంతుమో; కులభేదములు సృష్టించి హెచ్చులొచ్చులు రూపించి యెవరికర్మము వారిదే యని యెందాఁక మనము గిఱిగీసి యెడమెడముగా నుందుమో; బాల్యవివాహములు సేయుచు ననాథల కత్యాచారములు కావించుచు నంధపరంపరగా మూఢవిశ్వాసములతో నెందాఁకఁ గృళ్లిపోవుచుందుమో - అందాఁక నీ హిందూ జాతి ప్రపంచములో వర్తమానసర్వసభ్యసమాజము మ్రోలఁ దల యెత్తుకొని నిలువనేరదనీ యాతఁడు ఘోషించెను.

విదేశప్రచారకార్యక్రమమునకై వ్రాసినవేగాక యాతనివి మఱికొన్ని మహోన్నతగ్రంథములు కలవు. అమెరికా దేశీయురాలు మేయోకన్య యని యొకర్తుక యొకప్పుడీ దేశమునకు వచ్చి చక్కఁగా నాతిథ్యము పొంది పుస్తకమొక్కటి వ్రాసెను. దాని పేరు 'మదర్ - ఇండియా'. ఎవరో చెప్పినవి యేవేవియో మాటలు మూట కట్టి యీ దేశములోని దోసములను గోరంతలు కొండంతలుగా వర్ణించుచు భారతీయు లనఁగా నిట్టివాండ్రు సుమా యన్నధోర

ణిలోఁ బ్రచారము చేసెను. ఆ వ్రాఁతలకు గాంధిజీ యేవ గించుకొనియె. సప్రూ - అండ్రూస్ - ఠాగూరు - రంగయ్యరు మున్నగు పెద్దలు వానిని మిక్కిలిగా ధిక్కరించిరి. లాలాజీ మాత్రము బొత్తిగా వానిని సైఁపక కత్తిపట్టి ముక్కకు ముక్కగా - ప్రత్యక్షరము చీల్చి చెండాడి - అమెరికాలోని కుళ్లును వెల్లడిసేయుచు 'Unhappy India' అనుపేరఁ బెద్ద గ్రంథము వ్రాసెను. దానితో లోకమునకు నిజమేమో తెలిసిపోయెను. కాని యీ ఘట్టములో - అమెరికాలోని లోపములు చూపవలసివచ్చెనే యని యెంతో బాధపడి, యావల - ఆ దేశములోని మెఱుఁగులనుసైతము చిత్రింతు నని చెప్పి విశ్వమానవసాభ్రాత్రమును వెల్లడించెను.

పురాణపురుషుఁడైన శ్రీకృష్ణుని చరిత్రను లాలాజీ చక్కఁగా నభివర్ణించెను. ఛత్రపతి శివాజీని దొడ్డగాఁ జిత్రించెను. దయానందులు - గురుదత్తవిద్యార్థి మున్నగు మహాపురుషుల జీవితచరిత్రలు సవిశేషముగా సంతరించెను. విదేశ్యులలో దేశభక్తులగు మేజినీ - గారిబాల్డిల గాథలు హృద్యముగా రచించెను. హైందవసంస్కృతి పుట్టుపూర్వోత్తరములు చర్చించుచు విలువగల మేలిగ్రంథ మొకటి వెలయించెను.

ప్రథమప్రపంచయుద్ధానంతరము విదేశ్యప్రభుత్వ మెన్నాళ్లకో మేలుకొని భారతీయుల కేవేవియో యొఱుగఁ బెట్టవలెనని పార్లమెంటులోఁ జర్చించెను. ఇండియాకు వెళ్లి రాజకీయములను విచారించి యొక నివేదిక వ్రాసితెండని యొక కమిటీని - ఆ ప్రభుత్వ మీ దేశమునకుఁ బంపెను. దానిలో నేడుగురు సభ్యులు. దానికి నాయకుఁడు సర్.జాన్

సైమన్. అందువలన దానిని 'సైమన్ కమీషన్–' అని పిలిచిరి. వారి యార్భాటములవలన భారతీయుల కీ దేశములో రవ్వంతేని మేలు కలుగనేరదని యనుభవములోఁ దెలిసికొన్న యఖిలభారతనాయకులు – ఆ 'సంఘమును' బహిష్కరించిరి. కేంద్ర శాసనసభలో సైమన్ కమీషనును బహిష్కరింపవలెనని లాలాజీ తీరుమానము తెచ్చి తీవ్రముగా గంభీరముగా నుపన్యాస మిచ్చి దాని నామోదింపఁజేసెను.

సైమన్ కమీషను – ఈ గడ్డలోఁ గాలు పెట్టినవెంటనే బ్రహ్మాండమైన 'హర్ తాళ్' జరిగెను. ప్రధానపట్టణములన్నింటను – 'కమీషను'కు వ్యతిరేక ప్రదర్శనలు హోరాహోరిగఁ గానవచ్చెను. ఎక్కడఁ జూచినఁ దిరిగిపొండని నినాదములే. నల్ల జెండాల యూరేఁగింపులే. ఆ ఘట్టములోనే వీరకేసరియైన – 'ఆంధ్ర కేసరి' ప్రకాశము పంతులు చెన్నపురిలోఁ దా నొక్కఁడే యెక్కటియై నిలిచి సైమన్ కమీషనును ఢీకొనెను. ఇఁక లాహోరులో నద్భుతమైన ప్రదర్శనము సిద్ధమాయె. ఆ మహాజనమున కధినాయకుఁడు లాలాజీ. అతఁ డప్పు డంతగా నారోగ్యముతో లేఁడు; ఆపై – పెద్ద వయస్సు. అయినను – ఆవేశము తగ్గక యచ్చటికి రానేవచ్చెను. ప్రభుత్వము కన్ను లుఱిమెను. పెద్దగా గద్దించెను. 144 సెక్షను – అమలుపఱిచెను. ఎన్ని జరిగినను– ఏమైనను – ప్రభుత్వమును ధిక్కరింపవలెనని ప్రజలు నిశ్చయించిరి. శాంతిమార్గము విడువరాదని నాయకులు ప్రబోధించిరి. పట్టపగలు రెండుగంటలకు – ఊరేఁగింపు 'రైల్వేస్టేషను' వంకకు సాగెను. లాలాజీ–డాక్టరు సత్యపాల్–హంసరాజ్ మున్నగు మహామహులు–ఊరేఁగింపు ముంగల

నడచిరి.

ఆ మహాజనము స్టేషనువద్దకు వచ్చి యట్లే యాఁగెను. ముంగలి వీదికిఁ దీగెలు వేసి కమీషను వచ్చుటకు వీలు చేసిరి. పోలీసుభటులు పైయధికారులు కాపుదలలో నుండిరి. ప్రజలు నిరాయుధులై ప్రశాంతముగ నిలిచి పరిస్థితి ప్రతీక్షించుచుండిరి. అంతలో నుద్దవిడిని గారణము లేకయే యధికారులు ప్రజలమీఁదఁ బడిరి. ఆవల పోలీసులు లాటీలు పెద్దగా విసురుచుఁ జేయి చేసికొనిరి. ముందటివరుసలో లాలాజీ, ముందువాఁడుగా నున్నందున నాతని రొముంటి మీఁద లాటీదెబ్బలు విసురుగా వచ్చి తగిలెను. గుండె మీఁద బలమైన రెండుదెబ్బలు కొట్టిరి. లాలాజీ వీసమైన వెనుకకు నడువక కదలక మెదలక యట్లే నిలిచెను. తక్కిన నాయకులనుసైతము పెద్దగా మోఁదిరి. హంసరాజు బాటన వ్రేలు చిటిలి నెత్తురు వఱదలయ్యె. లాలాజీ గుండెపై దెబ్బ వలన నచ్చటి చర్మము లేచివచ్చెను. చికిత్స చేసిరి. జ్వరము వచ్చెను. ఆతనిఁ గొట్టిన యూరపియన్ సార్జెంటుపై - పగ తీర్చుకొనుటకై ప్రయత్నించిన యువకుల నెందఱనో యావల - ప్రభుత్వము పట్టి పెక్కు కేసులు పెట్టి యెన్ని చేయవలెనో యన్ని చేసిరి.

నాఁటి సాయంకాలము లాలాజీ యధ్యక్షత నొక్క మహాసభ జరిగెను. ఆ సభలో నాతఁ డన్నది యిది:-

'మహాజనముచేతిలోఁ గత్తులు కటారులు లేవు. అసలు మా సంకల్పము పోరాటము సాగించుటకుఁ గాదు. లాటీవ్రేటులు తినుటకు సిద్ధముగానే యున్నాము. ఈ యాంగ్లప్రభుత్వ మీ దేశములో నున్నంత వట్టు - ఈ లాటీ

దెబ్బలు మనకు వ్రాసిపెట్టినవే. దేశములో నొకవేళ హింసాత్మకవిప్లవమే జరిగినచో దానికి 'బాధ్యులు' పోలీసులు పైయధికారులుమాత్రమే. ప్రభుత్వము నేఁడు చేసినట్లు ముందుఁగూడ నిట్టి ఘోరములకే తలపెట్టెదరేని - ఈ దేశములోని యుత్సాహమూర్తులైన యువకులు - ఉత్తేజితులై యావేశపరులు కావలసివచ్చును. అప్పుడు నేనుగాని మాళవ్యాగాని మహాత్ముఁడుగాని వారి నదుపులోఁ బెట్టలేము. అహింసాధర్మమును బాటింపఁజేయలేము'

లాటీదెబ్బలనాఁటినుండియు లాలాజీ యారోగ్యము క్రమక్రమముగ నీరసింపసాగెను. ఆ పెద్దవయస్సులో - ఆ నీరసస్థితిలోఁ దగిలిన లాటీపోటులవలన దేహమింకఁ గోలుకోలేకపోయెను. మొదటికే మోసమై మంచము పట్టెను. జ్వరము ప్రకోపించెను. వైద్యులు శ్రమపడిరి. 1928 నవంబరు 16-వ తేది రాత్రి కాళరాత్రి యాయెను. దేహములో బాధ యేర్పడినది. మనుమఁడు 'భారత భూషణ్' సన్నిధిలో నుండి చక్కఁగాఁ బరిచర్యలు చేసెను. అందఱు నాందోళనములో మునిఁగిరి. ఆ రేయి వేకువను - ఆ మహాపురుషుఁడు - ఆ ధన్యమూర్తి - అఱువది నాలవ యేఁట 'హరీ' యనెను.

లాలాజీ మరణవార్త క్షణములో దేశములోఁ దెలిసెను. పంజాబులో దవ్వుదవ్వుల నున్నవారెందఱెందఱో-ఆ దేహమైన నొకసారి దర్శించిపోవలెనని కోరి యంత్యక్రియలు కొంచెమాఁగి చేయవలెనని తంత్రీవార్త లంపిరి. అట్లె నాఁటి మాపటివేళదాఁక నాతని శవము నచ్చటనే యుంచిరి. 'జలూాస్' నదీతీరమున నంత్యక్రియలకై యారోజునఁ

జేరిన జనము లక్షలతరబడిగా నుండిరఁట.

లాహోరులో - అంగడులు పాఠశాలలు. కళాశాలలు న్యాయస్థానములు మున్నగునవన్నియు మూసివైచిరి. యావద్భారతములో నెల్లెడల లాలాజీ మరణమునకై సంతాప సభలు జరిగెను. ఆతఁడు లేనికొఱంత దేశమున కెన్నఁడు తీఱునది కాదు. అప్పుడు గాంధిజీ చెప్పిన మాట యిది:-

'లాలాజీ యనఁగా - ఒక మహాసంస్థ. ఆయన లేఁబ్రాయమునుండియు దేశభక్తిని స్వధర్మముగా నిర్వహించెను. ఆ భక్తిలో రవ్వంతయుఁ గలుషము లేదు. ఆ మహాత్యాగముచేతనే - ఆయన, లోకులకంత సన్నిహితుఁడయ్యె. ఆయన జాతీయత - అంతర్జాతీయత సంపూర్ణత నందినవి. విదేశ్యులమీఁదసైత మాయన ప్రభావ మెంతో గాఢముగా హత్తుకొన్నది'.

గ్రంథకర్తగా - సంస్కర్తగా - తత్త్వవేత్తగా మహాత్యాగిగా - మహావక్తగా - న్యాయవాదిగా - పత్రికా సంపాదకుఁడుగా లాలాజీ దేశములో దొడ్డపేరు గడించెను. ఎందఱో కలసి యెన్నేండ్లకో చేయలేని మంచిమంచిపను లాతఁ డొక్కఁడే చక్కఁగాఁ జేసి చూపెను. లోకులు తన కర్పించిన నిధు లన్నియుఁ బదునొకండులక్షలరూప్యములుగాఁ బదిలపఱచి ప్రజాహితకార్యములకై పంచి యిచ్చెను. అట్టి దివ్యమూర్తి భవ్యజీవితము సర్వజనుల కాదర్శమై వెలయుఁ గాత!

शम्

భారతి - [illegible] తెనాలి 1955 రచన- 30-9-1955

# ఈ గ్రంథకర్తవి

1. వైదికవాఙ్మయచరిత్రము 2- 8-0
2. సతీసప్తతి (పద్య) 0- 2-0
3. కథావింశతి 0- 7-0
4. (చంద్రాపీడచరిత్ర) 0- 8-0
5. కామశాస్త్రము 2- 0-0
6. కావ్యమాల 1 భాగము 1- 4-0
7. కావ్యమాల 2 భాగము 1- 4-0
8. సుభాషితము 0- 4-0
9. ధర్మశాస్త్రము 2- 0-0
10. కవులకథలు 0- 7-0
11. వరరుచి 0- 8-0
12. ఈశ్వరసేవకులు 1- 0-0
13. విక్రమకథలు 0- 7-0
14. మ్రొక్కుబడి (పద్య) 0- 8-0
15. నవనాథము 1- 8-0
16. బృహత్కథలు 0- 8-0
17. వత్సరాజు 1- 4-0
18. విక్రమాదిత్యము 0-12-0
19. సాలభంజికలు 0-11-0
20. బాపూజి (పద్య. కా) 0- 8-0
21. చారుదత్తము 1-4-0
22. నీతిచంద్రిక [కరదీపికా వ్యాఖ్యాసహితము] 3-0-0
23. చిన్నయ్య [సూరి జీవిత చరిత్ర] 0-6-0
24. నైషధము 1-0-0
25. కలిపురాణము(పద్య. కా) 2-0-0
26. ప్రతాపసింహము [రాణా - ప్రతాప] 1-2-0
27. వీరపూజ 1-2-0
28. చాణక్యము 1-2-0
29. దివ్యమూర్తులు 1-2-0
30. మహారథులు 1-2-0
31. మేవాడ విజయము [గద్య కావ్యము] 2-0-0
32. శిశుఘ్న (పద్య) 0-4-0
33. తెలుగు వెలుగులు 0-7-0
34. చిత్రకథలు 0-7-0
35. వినోద కథలు 0-7-0
36. నవభారతము(పద్య. కా) 6-0-0
37. లోకతంత్రము ,, 1-0-0
38. పండితుడు ,, 0-2-0
39. శకుంతలా(సంస్కృతము) 0-8-0

భాషాపోషక గ్రంథమండలి - అమృతలూరు - గుంటూరుజిల్లా